నిష్పక్ష, నిర్భయ స్వతంత్ర రచనలకు గోలకొండ

# గోల్కొండపత్రిక

సాంఘిక, ఆర్థిక, కళా, విజ్ఞానాది వివిధ విషయములకు గోలకొండ

ప్రతి సోమ, గురువారములందు వెలువడు జాతీయపత్రిక

సంపుటము ౧౨ | హైదరాబాదు - దక్కన్ ౧ యిస్ఫందార్ ౧౩౪౭ ఫ. | శా. శ. ౧౮౫౯ ఈశ్వరనామ సంవత్సర పుష్య శు॥ ౩ సోమవారము | సంచిక ౬౭

## ఉద్యోగుల ప్రవర్తనా నియమావళి

రాజకీయ, మతఉద్యమములలో పాల్గొనగూడదు.

నిజాము రాష్ట్ర ప్రభుత్వ సభవారి ప్రతిపాదన ననుసరించి ను. ఘ. వ. నిజాము ప్రభువుగారు రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల నిత్యప్రవర్తనను గూర్చి కొన్ని నియమములు అంగీకరించి యున్నారు. ఈనియమముల ననుసరించి యే ప్రభుత్వోద్యోగియు ప్రభుత్వామోదము బడయనిది తన స్వంతమునకే గాని, కుటుంబమునందలి యేవ్యక్తి కొరకే గాని కట్నమే గాని, ప్రతిఫలమే గాని గైకొనరాదని నిషేధింపబడినది. ఏప్రభుత్వోద్యోగియు తన పాలనాప్రదేశమునందు నివసించు యేవ్యక్తికిని ఋణము నొసగకూడదు. అట్లే యేవ్యక్తినుండియు ఋణము గైకొనగూడదు. నియమ నిబంధనలకు లోనగు సక్రమ వ్యాపారియొద్ద తప్ప తన పాలనాప్రదేశమునందలి యేవ్యక్తితోను రెండువందల రూపాయిల మూల్యమునకు మించిన స్థిర, చరాస్తి యేదియును విక్రయపరచుటయే గాని, లేక తాను కొనుటయే గాని నిషేధింపబడినది. ప్రతి ఉద్యోగియు తానే గాని, తన భార్యయే గాని, లేక సంబంధికుడైన వ్యక్తి యే గాని కొనినట్టి లేక ఆదివరకు అధీనమునందుండినట్టి స్థిరాస్తి వివరములను ప్రభుత్వమువారికి తెలుపవలసియుండును. ప్రభుత్వమువారి ప్రత్యేకానుమతిని బొందనిది యేయుద్యోగియు బ్యాంకునే కాని, కంపెనీనే గాని స్థాపించగూడదు. అట్టి బాంకులందే గాని, కంపెనీలందే గాని, భాగస్వాములుగా చేరగూడదు. ఏ ఉద్యోగియు ప్రభుత్వమువారు ప్రత్యేకముగానే గాని, లేక సాధారణముగానే కాని ఆజ్ఞనొసగిన తప్ప ప్రభుత్వ పత్రములను, వార్తలను ప్రత్యక్షముగాగాని, పరోక్షముగాగాని వానిని తెలిసికొను అర్హతలేని ఉద్యోగికే గాని, లేక వార్తాపత్రికలకే గాని యొసగగూడదు. ఏప్రభుత్వోద్యోగియు యే ముద్రాక్షరశాలకును యజమానిగా నుండగూడదు. అయినను రాజకీయస్వరూపమునకు చెందని యేపత్రికకైన ప్రభుత్వామతి బడసి సంపాదకుడుగా నుండవచ్చును. కాని రచనలు మితవాదములోను, ఉచితజ్ఞతతోను యుండవలయును. అతనిపత్రికా సంబంధము ప్రజాక్షేమమునకు నష్టదాయక మగుచో ప్రభుత్వము అతని రచనలను ప్రకటించు ఆజ్ఞను ఉపసంహరించుకొనును. ఏప్రభుత్వోద్యోగియు హైదరాబాదు ప్రభుత్వము ప్రజలమధ్య నిజాం ప్రభుత్వము, బ్రిటిషుప్రభుత్వము, ఇండియా ప్రభుత్వము లేక భారతదేశీయ సంస్థానాధీశుల మధ్యగల సంబంధములను చెరుపు వ్యాసములనే కాని, ఉపన్యాసములనే గాని యొసగగూడదు. ఏ ప్రభుత్వోద్యోగియు ప్రత్యక్షముగానే, కాని, పరోక్షముగానే కాని యెట్టి రాజకీయ లేక రాజకీయస్వరూపముగల ఉద్యమములందు పాల్గొనగూడదు. ఒకవేళ ప్రభుత్వమువారు ఉచితమని తలచి అనుమతి నొసగినచో రాజకీయేతర ఉద్యమమునందు పాల్గొనవచ్చును. కాని యేప్రభుత్వోద్యోగియు మతపరివర్తనమునకు సంబంధించిన మహోద్యమమునందు పాల్గొనగూడదు. ఇంతేకాక అతని పరిరక్షణ, పోషణక్రిందనున్న యేవ్యక్తినిగూడ ప్రభుత్వమునకు నష్టమును కలిగించునట్టి, లేక పరోక్షముగా కలుగునట్టి ఉద్యమములందు పాల్గొననీయగూడదు. నిజాంరాష్ట్ర, లేక భారతదేశ రాజకీయ ఉద్యమములకు సహాయమొనర్చుటకై విరాళముల నొసగగూడదు. ప్రభుత్వామతిని బడసి పురపాలకసంఘము మొదలగు స్థానిక స్వపరిపాలనా సంస్థలందు అభ్యర్థిగా నిలువవచ్చును. కాని శాసనసభయందు యేపక్షమునకైన చెందిన అభ్యర్థి యెన్నికయందు అతనికై వోట్లను సంపాదించగూడదు.

## ౩౦ వేల ప్రజలకు వైమానిక శిక్షణ

షాంఘాయి డిసెం: ౨౭

చైనాలోని ముప్పదివేలప్రజలకు ఒక సంవత్సరము వైమానిక శిక్షణ నొసగుటకు ప్రభుత్వమువారు నిశ్చయము గావించుకొనినారు. వీరిలో పదివేలమంది మూడునెలలలోగానే పరిపూర్ణశిక్షణ బడసి యుద్ధమునందు పాల్గొనగలరని తెలుపబడుచున్నది.

## జాతీయోద్యమమునకు కళాశాలలు మూలాధారములు

### "విద్య పొట్టకూటికి కాదు"

కలకత్తా డిసెం. ౨౭

"జాతీయోద్యమము మేధావంతుల నాయకత్వముననే అభివృద్ధిజెందును. కళాశాలలనుండి ఉన్నతవిద్యనందుతీర్చబడినవారే మేధావంతులగుచున్నారు. కావున జాతీయోద్యమమునకు కళాశాలలే మూలాధారములు. కళాశాలవిద్యను మూలద్రోయుట జాతి కాత్మహత్య" అని నేడు సమావేశమైన అఖిలభారత విద్యావిషయిక సమాలోచన సమావేశమున కధ్యక్షత వహించుచు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ప్రకటించిరి.

శ్రీ రెడ్డిగారు విద్యాస్వరూపమును విశదీకరించుచు విద్యను బ్రతుకుతెరువు చూపునదిగ సంస్కరింపవలయునని యెల్లెడల ప్రతిధ్వనించుచున్న భావములను తీవ్రముగా విమర్శించి విద్య పొట్టకూటికి కాదని నిరూపించిరి. "నిరుద్యోగప్రాబల్యమునకు విద్యావిధానమునందలి లోపములు కారణములుగావు. నేటిసాంఘిక, ఆర్థిక లోపములే యిందుకు మూలములు. నేటి విద్యావిధానము లోపభూయిష్ఠము, నిరుపయోగకరమనుట సత్యదూరము" అని నుడివిరి.

గాంధిగారు ప్రథమమున విద్యాస్వరూపమును మార్పు డలపెట్టినట్లు యిప్పుడు చేయజాలకుండుట కిదియే కారణమని శ్రీరెడ్డిగారు తెలిపి బెంగాలు మాధ్యమిక విద్యాసంస్కరణ చిత్తుచట్టమునందు విద్యకంటెను యితరవిషయములకే ప్రాధాన్యమొసగినందులకు అధికారులను పరిహసించిరి.

## హిందూ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవము

కాశీ డిసెం ౨౭

నేడు కాశీమహారాజాగారి అధ్యక్షతక్రింద సమావేశమైన హిందూవిశ్వవిద్యాలయ స్నాతకోత్సవమునందు పండితమదనమోహనమాలవ్యాగారు విదేశవైజ్ఞానికప్రముఖులకును, ఇతరప్రముఖులకును డాక్టరుబిరుదములు నొసంగిరి.

పండిత మదనమోహన మాలవ్యాగారు వైజ్ఞానికులకు స్వాగతమొసగుచు హిందూ విశ్వవిద్యాపీఠమున నేడు ప్రాముఖ్యదివసమనియు, ప్రపంచవిఖ్యాతులగు వైజ్ఞానికులు తమ మధ్య యుండుటచే తాము ధన్యులమనియు వీరు తమజీవితమును విజ్ఞానము ధారవోసినవారనియు నుడివిరి.

వైజ్ఞానిక రాయబార నాయకులగు సర్ జేమ్సు జీన్సుగారు స్నాతకోపన్యాసము నొసగుచు విఖ్యాత విశ్వవిద్యాలయమును సందర్శించగలిగినందులకు సంతోషమును ప్రకటించిరి. భారతదేశ విశ్వవిద్యాలయములందు విజ్ఞానశాస్త్రమునకొసగబడుచున్న ప్రాముఖ్యత తమకు ఆనందమును గలిగించినదని నుడివిరి. జ్యోతిశ్శాస్త్రము భారతదేశమున నెట్టి అత్యున్నతస్థానమునందు గలదో జేమ్సుగారు వివరించిరి.

మహారాజా కోరాగారు హిందూ విశ్వవిద్యాలయమునకు ౫౦ వేల రూపాయిల విరాళము నొసగినని శ్రీ మాలవ్యాగారు ప్రకటించిరి.

## అమెరికా వలంటీర్లు

షాంఘాయి డిసెం: ౨౭

చైనా ప్రజలకు యుద్ధమునందు సహాయము గావించుటకై యేతెంచిన అమెరికా వలంటీర్ల రెండవదళము హాంకాంగు పోవుచున్నది. ఈదళమునందు ౧౦గురు విఖ్యాత మేజర్లును, ౧౦ మంది వైమానికులుగలరు. వీరివలన జపాను వైమానికదళముతో పోరాడుటకు అధికముగు సహాయము దొరకగలదని తలపబడుచున్నది.

## హిందీపై దుమ్ము దుమారము

### ప్రత్యేక తమిళ రాష్ట్ర నిర్మాణమునకై ఒత్తిడి

మదరాసు గవర్నరుయందు అవిశ్వాస ప్రకటన ప్రయత్నము

మదరాసు రాష్ట్రీయ తమిళమహాసభలో ఉద్రేకము

త్రిచీ డిసె ౨౭

మదరాసు రాష్ట్రీయ తమిళమహాసభ త్రిచీ పురపాలకసంఘమువారి పబ్లిక్‌హాలులో జరిగినపుడు హిందీ దుమ్ముదుమారము రేగెను. సభకుముందు ఉదయము హిందీ ప్రాతికూల్య ప్రకటనోత్సవము జరుపబడెను. ఆసేపు ఆ ఊరేగింపుతో పబ్లిక్‌హాలుకు పోవుచుండగా హిందీ ప్రచార కరపత్రములను పంచిపెట్టుచుండిన ఇరువురికి ఊరేగింపులోనివారలు కాయశుద్ధి చేసిరి. పోలీసులువచ్చి అల్లరి కాకుండ చేసిరి.

మహాసభవారు మదరాసు ప్రభుత్వమువారు హిందీని బళ్లలో నిర్బంధముగ నేర్పుటకు నిశ్చయించుటను యాక్షేపించుచు ఒకతీర్మానము చేసిరి.

తర్వాత ప్రత్యేక తమిళరాష్ట్రమును ప్రత్యేక తమిళ విశ్వవిద్యాలయమును ఏర్పాటు చేయుటకు మరియొక తీర్మానములో కోరబడెను.

ఇ. వి. రామస్వామి నాయకర్ అనువారు కాంగ్రెసుమంత్రివర్గము తొందరపడి చేయుచున్న పనులు అనేకములు తమిళుల అభిప్రాయమునకు విరుద్ధముగనున్నను గవర్నరు ఆపుల నాపుటకు జోక్యము పుచ్చుకొనందువలన గవర్నరుపై తమకు విశ్వాసము పోయినదనియు, సెక్రటరీ ఆఫ్‌స్టేటుగారు ఈగవర్నరును వెంటనే సీమకు పిలిపించుకొనవలెననియు సూచించుతీర్మానము ప్రతిపాదించెను. ముఖ్యముగా హిందీని బళ్లలో నిర్బంధము చేయించు విషయములో గవర్నరు ఎంతవేడినను జోక్యము పుచ్చుకొనలేదని నాయకర్‌గారు ఆగ్రహపడిరి. మహాసభకార్యదర్శి విశ్వనాథన్‌గారు ప్రతిపాదనను బలపరచిరి. కాని కదిరుత్తు చెట్టియార్‌గారును, వారివెంట మహాసభాధ్యక్షులును సి. డి. నాయకగారును ప్రతిపాదకుని ఆతీర్మానమును ఉపసంహరించుకొనుటకై కోరి, హిందీవిషయములో గల ఆక్షేపణను గవర్నరుగారికి మరియొకసారి నివేదించుకొనుటకై కొందరు రాయబారులను పంపవలెననియు, అప్పటికిని తమ కోరిక నెరవేరనిచోరు ప్రత్యేకసమావేశములో కర్తవ్య మాలోచించవచ్చుననియు సూచించిరి. ప్రతిపాదకుడు తీర్మానమును వాపసు తీసుకొనెను. ౧౨ మంది పలుకుబడిగలవారలు రాయబారులుగ నియోగింపబడిరి.

## వేంకటేశ్వరరావుగారికి వీడ్కోలుసన్మానము

నిజామాబాదు ఆంధ్రజన సంఘ సమావేశము

(గోలకొండ విలేఖరి)

నిజామాబాదు; డిసెం ౨౭

జిల్లా ఆంధ్రజనసంఘ పక్షమున గతఆదివారమునాడు రామస్వరూపు భవనములో స్థాయి సంఘ ఆంధ్రోద్యమ ప్రచారకులగు శ్రీ మంత్రిప్రగడ వేంకటేశ్వరరావుగారి గౌరవార్థము అల్పాహారవిందు జరిగినది. జిల్లా సంఘసభ్యులు ఆహ్వాన సంఘసభ్యులు, ఆర్యసమాజ సభ్యులు, పట్టణప్రముఖులు విందులో పాల్గొనిరి. మొదట లింగపుశాస్త్రిగారు ఆంధ్రులెవరో ఆంధ్రేతరులెవరో గుర్తెరగని యీజిల్లావాసులకు శ్రీ వేంకటేశ్వరరావుగారు ఆంధ్రోద్యమప్రచారము చేసి మహోపకారము చేసినవారని చెప్పిరి. పిమ్మట పి. సత్యనారాయణగారు మాట్లాడుచు యీ సమావేశముయొక్క ముఖ్యోద్దేశము మనజిల్లాలో వేంకటేశ్వరరావుగారు చేసినసేవ ప్రకటించుటకేయనియు, అభాగ్యము మనకుకలుగకుండా మనస్థానిక రక్షకశాఖవారు ఆయనమీద తెచ్చిన ౫౩ గష్తీ ఉల్లంఘన నేరమును ఆరోపించుటచే ఆయన మనజిల్లాలో చేసిన సేవచాలాకాలముక్రిందటనే తెలంగాణాయందంతట ప్రకటితమైనదనియు యిప్పటిసమావేశము లాంఛనార్థమేయనియు నుడివిరి. నిజామాబాద మహాసభలో ఆంధ్రసభా ఆశయపఠనము జరుగుచున్నదని మనమాతృభాషకు ప్రాముఖ్యతకల్గుచున్నదని ఆందోళనపడి అడ్జర్న్‌మెంటు తీర్మానమునకు ఆమోదము ప్రకటించిన ప్రముఖులలో వీరొకరనియు స్థాయిసంఘప్రచారకుడుగాయుండి యిట్లు ఆమోదము ప్రకటించినందుకు మాడపాటివారి సుందరింపులకు నరసింగరావుగారి నిర్దాక్షిణ్యమునకు పాలైనవారనియు ఈయన మాతృభాషాభిమానము, ధైర్యసాహసములు మెచ్చదగినవి కావని చెప్పిరి. జిల్లా సంఘకార్యదర్శి శ్రీ రుక్మారెడ్డిగారు, వేంకటేశ్వరరావుగారు మనజిల్లాలో జనసామాన్యమునకు చేసిన ప్రబోధమును వివరించి ఆయనను పుష్పమాలాలంకృతునిగ జేసిరి. డి. వి. స్వామిగారు మాట్లాడుచు వేంకటేశ్వరరావుగారితో ప్రచారమునకు తానుగూడ కొన్నిసమయములలో వెళ్లి ప్రచారము చేయుట తటస్థించినదనియు, ప్రచారము చేయుటలో ఆయనకుగల ఓర్పు, భక్తి, శ్రద్ధ చూచి తాను ఆశ్చర్యపడెననియు, మన జిల్లాసంఘముతరపున ఆయననే ప్రచారకునిగా నియమించవలెననియు, చెప్పి ఆయనకు పుష్పమాలను వేసిరి. పండితనరేంద్రజీ హిందీలో యుపన్యసించి వేంకటేశ్వరరావుగారికి పుష్పమాలవేసి సత్కరించిరి. అఖరున వేంకటేశ్వరరావుగారు సన్మానమునకుప్రత్యుత్తరమొసగుచు తాముజేసిన స్వల్పసేవకు యిప్పుడు తనకు జరిగిన యీ ఘనసత్కారమునకు తాను అర్హుడనుకాననియు, తనసేవకు ప్రజలతోడ్పాటే కారణమనియు నుడివిరి.

## అఖిలాంధ్ర కథకుల సమ్మేళనము

హైదరాబాద జన ౧

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము కార్యదర్శిగారు రిటుల వ్రాయుచున్నారు.

౪, ౫ ఫిబ్రవరి ౧౯౩౮ సం॥ తేదీలలో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమున శ్రీ కల్లవజ్ఝల శివశంకరశాస్త్రిగారి అధ్యక్షతక్రింద జరుగబోవు అఖిలాంధ్రకథకుల సమ్మేళనమును జయప్రదముగనిర్వహించుటకైఒక ఆహ్వాన సంఘము నేర్పాటుచేయుటకు నిశ్చయింపబడినది. సంఘపు సభ్యులును, సభ్యేతరులునుగూడ రు ౧/- తక్కువకాని విరాళము చెల్లించి ఆహ్వానసంఘములో సభ్యులుగా చేరవచ్చును. ఈక్రిందిమహాశయులు ఆహ్వానసంఘ సభ్యత్వము నంగీకరించిరని ప్రకటించుటకు సంతసించుచున్నాము.

(౧) మ, రా, శ్రీ ఇల్లిందల సీతారామారావుగారు
(౨) బి, యన్. శర్మగారు
(౩) ఖండవల్లి లక్ష్మీరంజనంగారు
(౪) బాపట్ల కృష్ణమూర్తిగారు
(౫) వండూరు కృష్ణమాచార్యులు గారు
(౬) పి. బి. ఏ. ఆచార్యగారు.
(౭) కస్తూరి కృష్ణారావుగారు
(౮) మంగు శేషగిరిరావుగారు
(౯) రావాడ సత్యనారాయణగారు

కథకుల సమ్మేళనమునందుఅభిరుచిగల మహాశయులందరును ఆహ్వానసంఘములో చేరి సమ్మేళనమును జయప్రదముగా చేయుటకు ప్రార్థన.

## ప్రజావృద్ధి

హైదరాబాద డిస ౨౭

అఖిలభారత ఆర్థికమహాసభాపక్షాన, ఆహ్వాన సంఘంవారు ఒక బాహుళ్యోపయోగార్థమై మూడు ఉపన్యాసాలు ఏర్పాటుచేశారు. అందులో మొదటి ఉపన్యాసం:— "ప్రజావృద్ధి"ని గురించి ప్రిన్సిపల్ కార్వేగారు ఉపన్యసించారు—పై ఉపన్యాససభకు "హిందూదేశపు రాజకీయార్థిక సమితి" దర్శకులునగు గాడ్గిల్‌గారు అధ్యక్షత వహించారు.

అధ్యక్షులవారు ఉపన్యాసకులను సభాసదులకు పరిచయపరుస్తూ కార్వేగారు గొప్ప ఆర్థికశాస్త్రనిపుణులనీ, బహు గ్రంథకర్తలనీ, ఉపన్యాసకులు వ్రాసిన పుస్తకములన్నిటిలో "అఖిలభారత సమాఖ్య" "ప్రజావృద్ధి"అను రెండు పుస్తకములు పేరెన్నిక గలవనీ సెలవిచ్చారు.

కార్వేగారి ఉపన్యాస సంగ్రహం—

యిరువదో శతాబ్దం ఆరంభించీ హిందూదేశం జనసామాన్య ఆర్థిక స్థితిగతులు కొంచంగా అభివృద్ధికి చెందాయి. కాని ఈ అభివృద్ధివల్ల జనబాహుళ్యానికి తగినంత ఉపయోగం కలగలేదు. కారణం— హిందూ దేశపు జనసంఖ్య నిరంతరాభివృద్ధియే —గత ముప్పయి, ముప్పయిఅయిదు సంవత్సరాల హిందూదేశపు ప్రజల జననమరణాదుల పట్టికను సమగ్రంగా పరికిస్తే జనసంఖ్యలో స్థిరత్వమూ—మరణసంఖ్యలో అభివృద్ధీ దృగ్గోచర మవుతాయి. శరీర అభివృద్ధివలన సగటు జనసంఖ్య మొత్తం మీద దినదినాభివృద్ధి చెందుతూ వున్నదని తెలుస్తుంది. ప్రజాభివృద్ధివల్ల ఆర్థిక శాస్త్ర నిపుణులకు తీరనిసమస్య ఏర్పడుతుంది. ఈ సమస్యా పరిష్కారమే నా ఉపన్యాస ముఖ్యోద్దేశము. రైతులు మనదేశానికి వెన్నెముకవంటివారు. కర్షకుల బాగోగులపైననే, మన దేశపు ఆర్థికస్థితిగతులు ఆధారపడి వున్నాయి. వారి కొనుగోలుశక్తి రోజురోజూ క్షీణిస్తూవుంది. వారిముడిసరుకులకు మార్కెట్టులేదు. కర్షకుల కొనుగోలుశక్తిని అభివృద్ధిపరచటానికై—వారి ముడిసరుకుల విక్రయానికై— వ్యవసాయేతర పరిశ్రమలద్వారా కొంతవరకు మధ్యతరగతి నిర్వ్యాపార సమస్యకూడా పరిష్కార మవుతుంది.

ఇంకొకసంగతి —వ్యవసాయంలో సహేతుకవాదాన్ని ప్రవేశపెట్టి యెంతో అభివృద్ధి చేయొచ్చు —కర్షకులు మూఢాచారాలని చేయూతగాగొని ఆర్థికంగా రోజురోజూ క్షీణిస్తూవున్నారు. ఈఆర్థిక క్షీణదశని ప్రతిఘటించడంకోసం వారిలో సహేతుక వాదాన్ని ప్రవేశపెట్టటం అత్యవసరం.

దేశంయొక్క ఆర్థికదుస్థితిని బాగుపరచాలంటే వ్యక్తిగతంగా ప్రతిమనుష్యుడూ బాగుపడాలన్నమాట. అందుకోసం ముఖ్యంగా జనసామాన్యంలో వ్యక్తిగతంగా ప్రతిమనుష్యుడూ బాగుపడాలన్నమాట. అందుకోసం ముఖ్యంగా జనసామాన్యంలో వ్యక్తిగతంగా ఆర్థిక దుస్థితిని తొలగించేప్రయత్నం చేయాలి. జనసామాన్యంలో ఈ మహత్తరప్రబోధము పుట్టించటమే ఆర్థికవిప్లవాన్ని లేవదీయటమన్నమాట. దేశంయొక్క ఆర్థికదుస్థితిని తొలగించటానికి ప్రతిమనుష్యుడూ పూనుకోవాలి. అప్పుడుగాని దినదినాభివృద్ధి చెందుతున్న "ప్రజాభివృద్ధి సమస్య పరిష్కారం కాదు."

అధ్యక్షులవారు కార్వేగారి ఉపన్యాసాన్ని సంగ్రహిస్తూ జననమరణాదులనుబట్టి జనసంఖ్య నిర్ణయించుట తప్పనీ. జనపరిగణన నివేదికల మీద జనసంఖ్య నిర్ణయానికి ఆధారపడటం అసమంజసమనీ, జనసంఖ్యసమస్య అఖిలభారతసమస్య కాదనీ, అది కొన్ని ప్రాంతాలకు చెందిన సమస్యఅనీ సెలవిచ్చారు. ఆయా ప్రాంతాలవారు వారివారిస్థితిగతులనుబట్టి సమస్యాపరిష్కారం చేయటం సమంజసముకూడా అని సెలవిచ్చారు—ఆహ్వాన సంఘ కార్యదర్శులగు హబీబ్‌రహిమాను గారి కృతజ్ఞతాభివందనాలతో సభ ముగిసింది,

## దుర్భిక్షములవలన రైతుల యిబ్బందులు

### మహబూబునగరము, రాయచూరు జిల్లా రైతుల విజ్ఞప్తి

హైదరాబాదు డిసెం ౨౪

మహబూబునగర జిల్లాలోని కల్వకుర్తి, మక్తల్ తాలూకా రైతులును, రాయచూరు జిల్లా లింగ్సుగూరు, దేవదుర్గ తాలూకా రైతులును భూమ్యాదాయశాఖా కార్యదర్శిగారికి దుర్భిక్షమువలన తమకు గలిగిన పంటల నష్టమును వివరముగా నివేదించుకొని భూమిపన్ను మాఫీ చేయుటకును, తకావీల నొసగుటకును కోరిరి. కల్వకుర్తి తాలూకా రైతుల విన్నపముపై కార్యదర్శిగారు మహబూబునగరం జిల్లా తాలుకాయగారికి ఆబీపంటలు నష్టపడిన నియమముల ననుసరించి మాఫీ చేయుటకుగాను చర్య జరుపవలసినదనియు, పునాసపంటలు నష్టపడిన ఆర్థికశాఖ ౧౩౧౭ ఫసలీ ౨౯ వ తీర్మానము ననుసరించి ఆప్రదేశములను పరిశీలించి బరాయింబా చేయుటకు చర్యగావించవలసినదనియు ఆజ్ఞనొసగిరి. ఇతరప్రదేశముల రైతుల విన్నపములనుగూర్చి త్వరలోనే ఉచితమగు ఆజ్ఞలు ప్రసాదింపబడనున్నవి.

## సింగపూరుపై దాడి

షాంఘాయి: డిసెంబరు ౨౭,

జపాను సేనలు సీనాను స్వాధీనపరచుకొనుటతోడనే అచటినుండి సీనా సింగుటోరీలు మార్గముద్వారా సింగపూరుపై దాడి వెడలుటకు ప్రయాణమైనారు. లీసక్‌లో చైనా సైనికులు యుద్ధమునకై సిద్ధమగుచున్నారు. అయినను వీరికి జపానుసేనలతో ప్రతిఘటించుశక్తిలేదని చెప్పవచ్చును. అమెరికా ప్రభుత్వమువారి సూచనలపై సింగపూరునందుగల అమెరికా ప్రజలను షాంఘాయికి పంపుటకై అమెరికా రాయబారి ప్రయత్నించుచున్నాడు. సింగపూరు రేవులో ఒక అమెరికా యుద్ధనావయు, ఒక బ్రిటిషు యుద్ధనావయు నిలిపియుంచవలయునని ఆయాదేశ యుద్ధనావికులు తీర్మానించుకొనియున్నారు.

## మదరాసు విద్యామంత్రిపై మట్టిముద్దలు, రాళ్లురప్పలు

### రిజర్వు పోలీసుల పిలిపింపు

మంత్రిగారు సభను శాంతముగ లేచిపోగోరుట

మదరాసు ౨౭ డిసంబరు

సేలంలో విక్టోరియా మార్కెట్ మైదానమందు బహిరంగసభలో మదరాసు విద్యాశాఖమంత్రియగు గౌ॥ డాక్టర్ పి. సుబ్బరాయన్‌గారిపైనను, ఇంకను అనేకులగు నాయకులపైనను మట్టిముద్దలును, రాళ్లురప్పలును, ఇంకను ఇతరవస్తువులును రువ్వబడినట్లు వార్త వచ్చినది.

"ఆత్మగౌరవ" పక్షము వారలును ముస్లిం లీగుసభ్యులును ఈ దౌర్జన్యములకు కారకులై యుండిరనచున్నారు.

మంత్రిగారు తక్షణమే సభవారిని శాంతముగా నుండగోరిరి. జనులు ఆమాటవినిని అల్లరి చేయక వెళ్లిపోయిరి. వెంటనే టెలిఫోను చేయుగా రిజర్వుపోలీసులువచ్చిరి. కాని వారి సేవ ఉపయోగించుకొనబడిలేదు.

# స్వాతంత్ర్యోపాసకుడగు డి వెలరా

## మృత్యువును ధిక్కరించి ఐర్లాండు స్వాతంత్ర్యానికి పోరి జయించిన ధీరుడు

"రాతిమీద పడిననీటిచే గోంటూకుక రంగువస్తుంది. ఆపదలనెదుర్కొన్న మీదనే మానవుడు యశోవంతుడౌతాడు" అంటారు పెద్దలు. నిజంగా దెబ్బపైదెబ్బ తిన్నమీదనే మానవుడు అభ్యున్నతశిఖరాన్ని చేరుతాడు. దారిలోని ముళ్లను తొక్కి, రాళ్లు—రప్పల మార్గాన్ని దాటినతర్వాతనే మానవుడు కార్యసఫలుడౌతాడు. వేదన వాని జీవనసహచారి అవుతుంది; కష్టాలు ముందుకువచ్చి వానిని కాగిలించుకొంటాయి; కాని, వాడు పర్వతంలా దృఢంగాఉంటాడు. కష్టంపైకష్టం వస్తుంది! ఐయినప్పటికి మహాత్వాకాంక్షియైన అమానవుడు లొంగడు, బెణకడు.

### దేశారాధకుడు

నేడు ఐర్లాండులో డీవెలరా దేవతలా పూజింపబడుతూ ఉన్నాడు. కాని, ఆ మహనీయుడు మృత్యువుతో క్రీడించుచున్నట్టి కాలముగూడ ఒకటిగలదు. చావు, బ్రతుకులమధ్య ఊగుచున్నట్టి ౧౯౧౬—లోని ఆ ఈస్టరు దినాలను డీవెలరా మరవలేదు. స్పెషల్ ట్రిబ్యునల్ ఆయనకు ఉరిశిక్ష విధించింది. ఉదయం ౭గంటలకు డీవెలరాను ఉరితీస్తారు. జైలు ప్రహరీగోడలమధ్య బందీకృతుడై డీవెలరా తనజీవితపు అంతిమ ఘడియలను శాంతి గంభీరాలతో ప్రతీక్షిస్తూఉన్నాడు. అనుమానీయుని హృదయంలో చింత ఏ మాత్రం లేదు. చేసినదేదియో ఐర్లండు స్వాతంత్ర్యానికి చేశానని ఆయన ఎరుగును. ఐర్లండు, బ్రిటన్ బంధనమునుంచి విముక్తిని బడయుటను తహతహలాడిపోయాడు. బ్రిటన్ కబంధ బంధంలో చిక్కియున్న ఐర్లండును విడిచిపెట్టుటకు కష్టపడ్డలేదు.

౧౯౧౬ ఈస్టరుదినాల్లో ఐర్లాండు నివాసులు తిరుగుబాటు జరిపారు. విద్రోహాగ్ని విపరీతంగా రగుల్కొంది. అసంఖ్యాకులైన ఐరిషు యువకులు తమజీవితాలను ఆహుతిచేశారు.

డీవెలరావద్ద ఆసమయాన ౧౦౦ మంది స్వయంసేవకులు మాత్రమే వున్నారు. వారందరు దేశస్వాతంత్ర్యానికై తమ ప్రాణాలను అర్పింప సిద్ధపడినారు. ఈకొద్దిమంది స్వయంసేవకులను వెంటపెట్టుకొని డీవెలరా రణరంగానికి ప్రయాణంచేశాడు. బ్రిటన్ అసంఖ్య సేనముందు ఈ వందమంది స్వయంసేవకులు ఏం చేయగలుగుతారు? ఈయుద్ధంలో డీవెలరాను ఖైదుచేశారు. కోర్టుమార్షల్ ఆయనను దోషిగ నిర్ధారణచేసి, ఉరిశిక్ష విధించింది. మరునాటి ఉదయం ౭గంటలకు డీవెలరాకు ఉరి.

### మృత్యుంజయుడు

ఆరాత్రి డీవెలరా జైలులో కూర్చుని తన భవిష్యత్తు ఆలోచిస్తున్నాడు. ఆయనకు తనప్రాణాలమీద మమకారంలేదు. తన మరణానంతరం తనప్రియమైన ఐర్లాండు ఏమవుతుందో అని మాత్రమే ఆయనకు విచారం; కాని ఉరిశిక్షను యావజ్జీవన ఖైదుగ మార్చినట్టు ఉదయం వార్త వచ్చింది. అసలువిషయం డీవెలరా అమెరికా దేశీయుడు. (ఆయనపుట్టుక, అక్కడనగనక).ఇందుచే బ్రిటీషువారు ఆయనకు ప్రాణదండన విధించలేకపోయారు. ఆనాడు డీవెలరా ఉరిపడిన, ఐర్లండుకేమి మేమయ్యేదో ఊహించడం కష్టం

డీవెలరా ౧౮ అక్టోబరు ౧౮౮౨—లో న్యూయార్కు నగరంలో జన్మించాడు. ఆయనతల్లి కైథారాయిన్ కోల్, ఐర్లండువిడిచి అమెరికా వెళ్లింది. అప్పుడే బీవాయిజా డీవెలరాఅనేపేరుగల ఒక స్పెయిన్ దేశస్తుని పరిణయ మాడింది. ఇలా ఐరిష్ ఫ్రీ స్టేట్ ప్రెసిడెంట్ డీవెలరా అమెరికా పౌరుడుగా జన్మించాడు. తన ఈ జన్మసిద్ధమైన పౌరసత్వ అధికారాన్ని వదలడానికి ఎప్పుడు డీవెలగా సిద్ధపడలేదు.

బాల్యంనుంచికూడా డీవెలరాకు ఐర్లండు అంటే చాలప్రేమ. ఆయన మొదట కొంతకాలం బ్లాక్ రాక్ కాలేజీలో విద్య నభ్యసించాడు, తర్వాత రోయాధీయల్ యూనివర్సిటీనుచి డిగ్రీపొందాడు, జీవితసంగ్రామంలో ప్రవేశించడానికి పూర్వం సోషల్ డిపార్టుమెంటులో చేరడానికి చాల ఉత్సహించాడు, కాని, ఆవాంఛఫలించలేదు: సివిలుసర్వీసులో కూడ అసఫలుడైనమీదట, డీవెలరా ఒకకాలేజీలో గణిత శాస్త్ర అధ్యాపకు డయ్యాడు. ౧౯౧౬లో విద్రోహాగ్ని వ్యాపించడంచుటతోనే, డీవెలరా ఉద్యోగానికి స్వస్తి చెప్పి, దేశసేవలో నిమగ్నుడై, ఈస్టరు విప్లవంలో పాల్గొన్నాడు. తాను మొట్టమొదట ఉద్యోగానికి ఏపోస్టాఫీసుకు దరఖాస్తుపెట్టాడో, దానిపైనే ఆయన అందరికంటె ముందుగా జాతీయతవర్ణ పతాకాన్ని ఎగరవేశాడు.

### సత్యాగ్రహి

ఈస్టర్ విప్లవాన్ని అణచివేసిన తరువాత డీవెలరాను లాయీ జైలులో ఉంచారు. జైలులో ఆయన తక్కిన రాజకీయ ఖైదీలతో చేరి సత్యాగ్రహం ప్రారంభించాడు. తత్ఫలితంగా రెండో ఈస్టర్ విప్లవం ప్రారంభమయింది ఈ విప్లవపరిణామంగా ౧౯౧౭ జూన్ నెలలో ఐరిషు ఖైదీలందరిని విడుదల చేశారు జైలునుంచి విడుదలైన వెంటనే డీవెలరా సంచారానికి బయలుదేరాడు. సంచారంలో ఆయన ఇచ్చిన ఉపన్యాసాలు ఐర్లండులో నూతన ఉత్సాహాన్ని కలిగించాయి.

ఇంతలో ౫త మహాయుద్ధంలో ఐర్లండు పాల్గొనే విషయమై బ్రిటిష్ పార్లమెంటులో ఒక "లా"ప్యాస్ చేసి, లాలింపులద్వారా కొందరు ఐర్లండువాసులను తనపక్షం చేసుకుంది. కాని, ప్రజాభిప్రాయం డీవెలరా పక్షంగా ఉన్నదని గ్రహించి చాల అసంతృప్తిపడింది. అంతట ఐర్లండులోని కొంతమంది నాయకులను బంధిస్తేనేగాని, ఐర్లండుఅంతా యుద్ధంలో పాల్గొనదని బ్రిటన్ ఆలోచించింది. ఆదేశప్రకారం ఐర్లండులో (యుద్ధ సంబంధ ఆందోళన ప్రారంభమైననాటి రాత్రి) అరెస్టులు ప్రారంభమైనాయి. సీన్‌ఫీన్‌పక్షంవారు అరెస్టుకై ముందే సిద్ధంగావుండిరి. వీరిని కమకార్యం ఆగిపోకుండా నూతన నాయకులను కూడ ముందే నియుక్తపరచుకొన్నారు.

డీవెలరావద్ద ఐర్లండుపటం (జల—స్థల—సైన్యపు పూర్ణ వివరణతోఉన్నది.) దొరికిందనే నేరంక్రింద ఆయనను బంధించి కొద్దిరోజులు లింకన్ జైలులో వుంచారు.

మైకేల్ కాలిన్సు, హేరీ బోలెండ్ కలిసి తమ సహచరుడైన కేలీని, డీవెలరాను విముక్తి చేయడానికి వీలుచూసి రావలసినదని లింకనుకు పంపించారు. కేలీ లింకనుకు వెళ్ళాడు. పదిహేనురోజులపాటు అక్కడవుండి, ఆయన డబ్లిన్ తిరిగివచ్చాడు. డీవెలరాతోపాటు సీన్ మిల్‌రో అనేఒక ఐరిష్ వ్యక్తికూడ జైలులోవున్నాడు. అతడు ఆసమయంలో డీవెలరాకు కుడిభుజంగా వున్నాడు. అతడు గొప్ప చిత్రకారుడు, వీరున్నకొట్టుకు ఒక పెద్ద తాళం వేసివుండేది. మిల్‌రో అతాళాన్ని తియ్యడానికి వీలిచ్చే చెవిబొమ్మను కాగితంపై వేశాడు. ఖైదీలు తమ క్షేమ సమాచారాలను బంధువులకు తెలుపుకొనే రోజున మిల్‌రో కూడ ఒకపావరీపేర ఉత్తరంవ్రాశాడు. ఆయన అతి చాతుర్యంతో తన దళంవారికి బొమ్మలోవున్నమాదిరిగా తాళంచెవిని తయారుచేయమని వ్రాసిపంపాడు.

### మూరు తాళం చెవి చిన్నదై పోయింది

డీవెలరా అనుచరులు తాళానికి సరియైన తాళంచెవిని మాంచెస్టరులో తయారు చేయించారు దానిని ఒకకేక్‌లో వుంచారు మూడు కేకులు ఒకేమాదిరి వాటిని తయారుచేశారు. తాళంచెవి ఎందులో ఉంచబడింది తెలిసికొనడంకష్టం. జైలు హెడ్‌వార్డరు తన చేతితో ఒకకేక్ కోసి ఖైదీలచేత తినిపించాడు. కాని, తాళంచెవి ఆకారం చిన్నదవడంవల్ల వార్డరుకు అజాడ తెలియలేదు. అది ఖైదీలకు చేరిపోయింది.

డీవెలరా, ఆయన సహచరుడు తాళంచెవిని తీసికొన్నారు. కాని అదికొంచెం చిన్నదికావడంచేత తాళంరాలేదు అయినా, డీవెలరా ఆయన సహచరుడు నిరుత్సాహపడలేదు. తిరిగి ఉత్తరంద్వారా ఈ సమాచారాన్ని వారు తమ మిత్రుల కెరుకపరచారు. రెండవ పర్యాయం ఇంగ్లాండులోవున్న ఐరిష్ బాలికకు కేక్ అందజేసేపని ఒప్పగించారు. ఈబాలిక లింకన్ జైలుకుచేరి, కేకులు డీవెలరాకు అందజేసింది. ఈపర్యాయం పంపిన తాళంచెవి తాళానికి సరిపోయింది.౧౯౧౯ జనవరిలో కొంతమంది ఐరిష్‌ఖైదీలు యూస్క్ జైలునుంచి పారిపోయారు. ఇందుచే వెలరాపైన, ఆయన సహచరులపైన సర్కారు గట్టికాపు చూస్తూవుం

(౭వ పేజీ చూడుడు)

# హిందీ నిర్బంధం వద్దు

## హిందీ భారత సంయుక్తభాషా?

—శ్రీమతి నందగిరి ఇందిరాదేవి.

ఇదివరకె చాల పర్యాయములు హిందీ నేర్చుకొనవలయునా వలదాయని వాగ్వివాదములు, పత్రికలందు చర్చలు జరిగినవి. చాలమంది నాయకులు తదితరులు హిందీవలన లాభములు గలవని తలంచినవారు నేర్చుకొనినారు, నేర్చుకొనుచున్నారు. పెద్దవాళ్లు నేర్చుకొనుటయే గాకుండా పిల్లలున్న ఆడవాళ్లుగూడ ఏదోవిధముగా సంభాషించుకొని తమ మాతృభాషనభివృద్ధిచేసికొనవలెననెడి పట్టుదలకంటె రెండింతలెక్కువ పట్టుదలతో పండిత్ జీలను పెట్టుకొని ఠంటాలు పడుచున్నారు. హిందీ ప్రచారము మనదేశములో అంతయెక్కువ ప్రబలిపోయినది. ఈపిచ్చి మరీ బ్రిటిషుఇండియాలో. సరే. ఇష్టమున్నవారు ఫ్రెంచి, లాటినుకూడ నేర్చుకొనుటయందు యెవరికేమి అభ్యంతరముండదు. ఇటీవల కాంగ్రెసు మంత్రివర్గము పనిచేయుట మొదలు పెట్టినప్పటినుండి మనకష్టములు గట్టెక్కుకాలము వచ్చినదిగదా సంతోషము కలుగుచున్నది. కాంగ్రెసులో తమకు సంబంధించిన వ్యక్తి పనిచేయుచున్నాడనిన ప్రతి సంఘము వారికి అతనిపై గంపెడన్ని ఆశలుంచుకొనుట సహజము. ప్రస్తుతము బ్రిటిషు ప్రభుత్వమునుండి కొద్దిగా సడలి మనవారిచేతికి ప్రభుత్వమువచ్చినదని సంతసించుటకిదియే కారణము. కాంగ్రెసుకు పెత్తనము వచ్చినప్పటినుండి మద్యపాననిరోధము, నిర్బంధోచిత ప్రారంభవిద్య నెలకొల్పుట మొదలయిన సంస్కరణములు అమలునందుంచబడుచున్నది. ఇక ముందుగూడ ఇట్టివిమనకు లాభదాయకమగునవి కలుగుట కవకాశములుగూడ చాలగలవు.

కాని వేపకాయంత వెర్రిలేనివాడు లేనట్లు ఈ హిందీ ప్రచారము మనకు నష్టము కలుగజేయుచున్నది. ఈ విషయములో ఇదివరకు ప్రచారము చేసినదివేరు. ఇప్పుడువేరు. ఏలనన ఇప్పుడు ప్రభుత్వపు అధికారమనిపించుకొనును. కనుక ఈహిందీ నిర్బంధముగా మన నెత్తిన బడకముందే జాగ్రత్తబడి కాంగ్రెసు నాయకులైనవారితో మన అభిప్రాయములను చెప్పుకొనుట మంచిది.

హిందీ ఇకముందు ఇష్టమున్నవారు నేర్చుకొనుటగాక తప్పనిసరిగా అన్ని విషయములతోబాటు చిన్నప్పటినుండియే చాల బాలికలు నేర్చుకొనుటకై ఏర్పాటు చేయబడునని కాంగ్రెసువారు తమ అభిప్రాయములను పత్రికలందు ప్రకటించుటయేగాక హిందీ తరగతులను హిందీ పాఠశాలలను నెలకొల్పుట కు ప్రయత్నించుచున్నారు. అట్టి పాఠశాలలు కన్యాకుమారినుండి హిమాలయమువరకు స్థాపింపబడినవి. ... దక్షిణ భారతీయులకు చాల నష్టములు కలుగగలవు. అసలు కాంగ్రెసు నాయకులు హిందీని నిర్బంధముగా నుంచుటకు పెక్కు కారణములు సూచించు చున్నారు.

భారతదేశమునందు లెక్కలేనన్ని భాషలున్నవి గనుక ఒకజాతి మరియొకజాతితో మాట్లాడుటకుగాని, తమ అభిప్రాయములను పరస్పరము వెల్లడించుకొనుటకుగాను హిందీలను సాధారణభాష (కామన్ లాంగ్వేజ్) ఉండుట చాల అవసరమనునది ఒక కారణము. దీనివలన విదేశీయుల వెక్కిరింపులకు పాలుగాకుండ కిందినుండి మీదవరకు భారతదేశమంతయు ఒక్కటేభాష నెరిగినదని మెప్పులు బడయుటకు అవకాశము కలిగియుండును. హిందీ అను ఒక్కటేభాషయుండిన ప్రజలందరు ఐకమత్యముగలిగి దేశభక్తితో మాతృదేశోద్ధరణమునకు పాటుపడెదరు. అంతేకాక పరదేశ భాషయగు ఆంగ్లమును భారత ప్రజలు వ్యయప్రయాసములకోర్చి శ్రద్ధతో నేర్చుకొనుచున్నారు. మాతృభాషనుకూడ విస్మరించి (కన్వెంటు) పాఠశాలలకు తమపిల్లలను పంపుచున్నారు. పరదేశభాషయగు ఇంగ్లీషుకంటె చెడిపోయినదా హిందీ? హిందీకి సంస్కృతమునకు చాల దగ్గరిచుట్టరికము. సంస్కృతము అన్నిజాతులకు వంద్యమైనదే గాక అభిమానపు భాషకూడ. భారతీయులందరి అభిప్రాయములు ఒక్కటేగనుక హిందీ నేర్చుకొనుటయందు అభ్యంతరముండదు.

హిందీవలన మాతృభాషలుకూడ అభివృద్ధి పొందుట కవకాశములు గలవు. ఒకభాష సంపర్కమువలన అందులోనుండు జాతీయములు మాధుర్యమును తనలో నిముడ్చుకొని వృద్ధినొందగలదు. ఆభాషలోనుండు విజ్ఞానమును, భాషాంతరీకరణముద్వారా పొందవచ్చును. హిందీలోనుండు విజ్ఞానము మాతృభాషలు సేకరించి భాషౌన్నత్యమును పెంపొందించుకొనవచ్చును అంతేగాక హిందీ అంత కష్టమైనభాష కాదు. చాల తేలికగా నేర్చుకొనవచ్చును. భారతదేశములోని అన్నిప్రాంతములకు (ప్రావిన్సెస్) (ఇంటర్ కమ్యూనికేషను) అంతరంగిక వ్యవహారములకు ఉపయోగపడును. రాష్ట్రభాషయనునది ఉండిన ఏప్రాంతమునకు వెళ్లినను చిక్కులేకుండును. కనుక ప్రతి భారతీయుడును హిందీ నేర్చుకొని భారతదేశము నుద్ధరించి ధన్యుడు కావలయునను ఉద్దేశముతో పై కాంగ్రెసు నాయకులు చిన్నప్పటినుండియే హిందీ నేర్చుకొనవలయునని పాఠశాలలందు నిర్బంధభాషగా నుంచవలెనని యాలోచించుచున్నారు.

కాని కొంత స్వతంత్రాలోచనతో పరిశీలించి చూచినచో పై వాదము సర్వసమ్మతముకాదని తేటపడగలదు.

భారతదేశములో చాలభాషలున్నవి చాల దేశములున్నవి ... విదేశీయుడాశ్చర్యపడునటుల ... సాధారణభాష (కామన్ లాంగ్వేజ్) నొకటి యుంచుట అసంగతము. భారతదేశమంతటిలోనికాలదేశములలో ఒక్కటేభాష యుండుట అసంభవముకూడ. ఈదినము సాధారణ భాష హిందీ ఉండవలెను అన్నవారు రేపు ఒక్కటేవేషము ఉండవలయును జాత్యుద్ధరణమునకని ఉత్తర హిందూస్థానీల లుంగీలు, కుడిముఖముగా చీరలు కట్టుకొనుమని ఈ రాజగోపాలాచారిగారు విన్నవించక పోరు. తరువాత ఒక్కటే ఆహారముండిన భారతీయుల ఐకమత్యము మరింత చక్కగా తేటపడునని అక్కడి రోటీ, దాల్ మన గోంగూరపచ్చడి విస్తళ్లకుబదులు ఆ రికాబీలలో ప్రత్యక్షము గాక పోవు. కనుక ఇతరుల మెప్పుకోసం మన అభిరుచులను త్యాగముచేయుట అధర్మము.

అంతరంగిక వ్యవహారము (ఇంటర్ కమ్యూనికేషన్) కొరకైనను హిందీ అవసరమని చెప్పవచ్చును. భారతదేశములో మాటలాడే భాషలు ఎన్నిగలవో దానినిబట్టి ప్రాంతములు (ప్రావిన్సెసు) ఏర్పాటు కాంగ్రెసు ఆదర్శము దానికి తార్కాణముగా ప్రస్తుతము కాంగ్రెసు ప్రచారమువరకు భారతదేశమంతము (లింగ్విస్టిక్ బేసిస్) భాషాధారముమీదనే విభజింపబడియున్నది. ఆంధ్రదేశములో జరుగుచున్న ప్రచారమంతయు తెనుగులోనే జరుగుట విధియైయున్నది, అటులే జరుగుచున్నదికూడ. రేపో మాపో ప్రావిన్సులు భాషాధారము (లింగ్విస్టిక్ బేసిస్) మీద ఆగుటతోడనే శాసనసభలు మొదలైన ప్రభుత్వ వ్యవహారములు పైవేటువ్యవహారములు అన్ని తెనుగులోనే జరుగుచుండ ప్రతి పల్లెటూరు, పట్నములలో నుండు ఆంధ్రునికి హిందీతో అవసరమేమిటి? ఇంకొక ప్రాంతమునకు బోదలచిన వ్యక్తికి ఆప్రాంతపు మాతృభాష అవసరముకాని హిందీతో పనిలేదే! కాని బులుసు సాంబమూర్తి, రాజగోపాలాచారి మొదలైన కాంగ్రెసునాయకుల (ఆల్ ఇండియా లీడర్సు) వలె తయారు కాదలచినవారు నేర్చుకొనుట సమంజసము. నిర్బంధముగా మాకువద్దు బాబూ అని. మొత్తుకొనుచుండ మానెత్తిన హిందీనిరుద్దుట అన్యాయము.

ప్రజలలో హిందీ నేర్చుకొనుటవలన ఐకమత్యమేర్పడి దేశసేవకు మార్గదర్శకమగునను నది అంత సహేతుకమైనది కాదు. దేశసేవకొరకు హిందీ వచ్చితీరవలసిన పనిలేదు. కాంగ్రెసులో ఎక్కువగా పనిచేయుచున్నది హిందీ రాని ప్రావిన్సులే. మొన్నటి ఎన్నికలందు కాంగ్రెసు ఎక్కువ విజయముపొందినది హిందీనెరుగని ద్రావిడుల మద్రాసుప్రాంతమే యనుట తేటతెల్లము. దేశభక్తి భాషాభేదమువలన ఉండకపోదు. "మేరా దేశ్" అని హిందీలో అనుకొనిన భక్తిఅగును గాని నాదేశమని మాతృభాషలో తలచిన కాకపోవునా? "షక్కర్ మీఠా హై" అనిన తీపి యెక్కువయగును కాని "పంచదార తియ్యగా నున్నది"నిన తీపి తక్కువ కాదుకదా! ఈ హిందీవలన మాతృభాషలకు స్థానము లేకుండా పోవుచున్నది. అవసరమును బట్టి యేసనియైనను వృద్ధియగును. ముఖ్యముగా భాషవాడుకొనుచున్న కొలది అభివృద్ధికి ఎక్కువ అవకాశములుండును. ఇక హిందీయే వాడుకలోకి నిర్బంధభాషగా వచ్చినట్లయిన ఇదివరకే నగముచచ్చిన మాతృభాషలు పూర్తిగా మూలపడును. ఈపరిశోధన చేసి చూడవలసినపనిలేదు. నైజామురాష్ట్రములోని హైద్రాబాదనగరమునందు ఉస్మానియా విశ్వవిద్యాలయము స్థాపించి బ్రిటిషిండియాలో కాంగ్రెసువారు ప్రస్తుతము హిందీకియ్యదలచిన ప్రాముఖ్యతను ఇక్కడ ఉర్దూకు ఇచ్చినందువలన మాతృభాషలస్థితి ఎంత అందముగా నున్నదో చూడవచ్చును. ఇచ్చట రాష్ట్రమంతటను ఒక్కటేభాష యుండవలయునని ప్రతి పల్లెటూరిలో దప్తరములన్నియు ఉర్దూలోనే యున్నవి. కనుకనే ఇక్కడి ఆంధ్రులు తరతరాలనుండి వేషములుధరించి తమ మాతృభాష రాకపోయినను మానేగాని మౌల్విసాహెబ్ దగ్గర "అలీఫ్ బే" నేర్చుకొనుచున్నారు. చదువుకొనుటయనిన ఉర్దూద్వారానే చదువుకొనవలయును. ఆడపిల్లలుసహితము విద్యావంతులు కావలయుననిన ఉర్దూద్వారా నేతప్పగత్యంతరములేదు. ఇక్కడిఆంధ్రులు, తాముచివరకు ఆంధ్రులమనిగాని, తమ మాతృభాష ఆంధ్రమనిగాని చెప్పుకొనుటకు సిగ్గుపడుచున్నారు. జనసామాన్యముటుండ, ఉన్నతవిద్యయందారితేరిన విద్యావంతులుసహితము ఈతురకజండానీడ కవతలనున్న ఆంధ్రుల సహోదరుల మేముఅని అనుకొనుటకు వాలుకాదుటలేదు. గుండెలు లేవు. బ్రిటిషుఆంధ్రుడు ఇక్కడివానినిజూచి "ఆంధ్రదేశా" అని ముక్కుమీద వేలువేసుకొని చూచుసంతపరిస్థితికి వచ్చినది. ఇది మాతృభాషలకన్న ఉర్దూను నిర్బంధభాషగా నొనర్చుటవలన కలిగిన జాతీయ పరిణామము. రేపు బ్రిటిషుఇండియాలోకూడ హిందీ నిర్బంధభాషయైన ఇక అందరు లుంగీలతో తయారగుదురనుటలో సందియములేదు. ఈపరిశోధన ఇదివరకే ఇక్కడ చేయబడినదిగావున బ్రిటిషుఇండియా ఆంధ్రులకు హిందీనుండి తప్పించుకొనుటకు ఆదర్శప్రాయముగా నిల్చినది,

పరదేశభాషయగు ఇంగ్లీషు నేర్చుకొనుటయందు వ్యయప్రయాసముల కోర్చుకొనుచున్నారు గాని హిందీఏల నేర్వరుఅని ఆచార్యులవారి సూక్తి. దానికి సాంబమూర్తిగారి తలఊపు. కాని ఈమాటనిజముగా రాజగోపాలాచార్యులవారి పెదిమలనుండియే జారినట్లైన ఇదివారయనకు గౌరవమును ఆపాదించేది కాదు. సాంబమూర్తిగారి కంతకన్న పాపగదు. ఏలనన ఈ అర్థశతాబ్దమునుండి భారతీయ సంతానము కాంగ్రెసుద్వారా ప్రాణములధారవోయుచు ధనమానముల త్యాగమొనర్చుచు తంజోపతంత్రములుగా జైళ్లపాలొంచుచు ఎడతెగని కృషిచేసినది కేవలము భారతసింహాసనములో తెల్లవానికిబదులు నల్లవానిని ప్రతిష్ఠించుటకేకాదు. ఆట్లయిన కాంగ్రెసు ఒకఛాందస సమితి. భారతీయులను హింసించుచు వారి ఆశసాధిలాషలకు విరుద్ధముగా వారిని నిర్బంధించు పాశములు తెల్లవారు కోరకున్నపను భక్తులకావలసినదే. వానికట్టు నిర్బంధించువాడు ఏకోనారాయణుడైనను పొదనూడదని కొందరలసినదే. అట్టితరి తెల్లవాడు ఇంగ్లీషునిర్బంధముచేసిన రాజగోపాలాచారిగారు హిందీనిర్బంధము చేసెదననిన... ... ...!

అయినను ఇంగ్లీషుకుబదులుగా హిందీనుంచుట లేదు. ఇప్పుడున్న విద్యాపద్ధతి ఉత్తమవిధముగాలేదని, విషయములు పెక్కులున్నవని దేనిలోనైనను సరియైన జ్ఞానముసంపాదించుట కవకాశములులేవని విద్యాసంస్కరణములకు ప్రయత్నములు జరుగుచున్నవి, ఈపరిస్థితులలో ఉన్నవేనేర్చుకొనలేక అవస్థపడుచుండ హిందీకూడ చిన్నప్పటినుండియే నిర్బంధభాషగానుంచుట విద్యార్థులకష్టపెట్టుటతప్ప మరేమియుగాదు. హిందీ నేర్చుకొనుట దోషమనుటలేదుగదా! కాని నిర్బంధభాషగా నుండవలదు. ఉన్నతతరగతులలో ఐచ్ఛికవిషయముగా, సంస్కృతము, ఫ్రెంచి, లాటిను, మొదలైనవి ఉన్నట్లు, ఉంచినట్లయిన గొప్పకోరిక లున్నవారు తీసికొందురు. ఎవరికి అభ్యంతరమేమియు ఉండదు. కాంగ్రెసువారి ఉద్దేశము సక్రమముగా నెరవేరగలదు. భారతీయులందరు ఒక్కటేయని బులుసు సాంబమూర్తిగారు సెలవిచ్చినారు. మాతృదేశోద్ధరణ సందర్భమున ఒక్కటిగావచ్చునుగాని వారివారిరుచులు వేషము, భాషభేదములుగా నుండక తప్పదు. ఏ ఒక్కవిషయమునందైనను సాధారణముగా లేదు. ఉత్తరహిందూస్థానమువారికి మనకు తిండిలో, వేషములో, భాషలో, పద్ధతులలో ఆ

(ఇక పేజి చూడుడు)



# యిష్తెహారు

మహకమా నజామతు
అబుకారి మమాలికు
మహరూస సర్కారుఆలీ

తా॥ ౭ బహమన్ సన్ ౧౩౪౭ సా

నిషాన్ మిసల్ నిజామతు
౫౪ సెగ జాగీరాతు
౫౩ సన్ ౧౩౪౭ సా॥

## మొకద్దమా

యిష్తెహారు అదాయి అక్సాతునే మాహి అవ్వల్ సన్ ౧౩౪౭ సాలు బాబతు అమదని శేంది జాగీరాతు.

జాగీరాతు వ మవుజా మఖ్తాల అమదని శేంది సెమాహి అవ్వల్ సన్ ౧౩౪౭ సాలు కిస్తుయొక్క అదాయి తా॥ ౯ యిస్ఫందారు సన్ ౧౩౪౭ సాలు నుంచి అమల్ లో రాగలదు. చెక్కులతక్సీము ౯ యిస్ఫందారు సన్ ౧౩౪౭ సాలు శని వారమునుంచి ౧౧ యిస్ఫందారు గురు వారమువరకు యీ మహాకమానుంచి అప్రుతూవుండగలదు. యే జాగీరుదార్లు అయితే చెక్కులు తీసుకోగలందుకు స్వంతముగ రాజాలరో వారలు తమ కారు పరదాజులజర్యాన తెప్పించుకో జాలుదురు ఫక్తు.

హసుబె మస్విదా దస్తఖత్ ఆలీ జనాబు నాజంసాహెబు బహద్దరు.

దస్తఖత్ మదదుగారు నాజం

# ప్రకటన

నైజాము రైల్వేకు సంబంధించిన యీ క్రింది సెక్షనులలో రాలిన మసి బొగ్గు (బూడిద) సాలీనా కంట్రాక్టు మీద 5 సంవత్సరములవరకు కొనగోరు వారి టెండర్లు కావలసియున్నవి.

| | | |
|---|---|---|
| లాలాగూడ | — | కాజీపేట |
| హైదాబాదు బి.జి | — | వాడి |
| సికింద్రాబాదు | — | పూర్ణ |
| హైదాబాదుఎం.జి | — | ద్రోణాచలం |

సీలు వేయబడిన టెండరులు నైజాము రైల్వే లోకో అండు క్యారేజి సూపరింటెండెంటు లాలాగూడ, యఫ్. యం. హోఫ్ దార్ గారికి 1938 సం॥ 10 వ జనవరి మధ్యాహ్నములోగా ఆఫీసులో దాఖల్ చేయవలెను.

యిందుకు సంబంధించిన షరతులు పై చెప్పిన ఆఫీసులో తెలుపబడును.

డబ్లియు. జి. నిక్సులను,
లోకోసూపరింటెండెంటుగారు.

## దేశములో పత్రికలన్నీ బందు

## రొమేన్యాదేశము రొమేనీయులకే

## నియంతగారి సందేశము

బుఖారెస్టు డిస ౩౧

సోవియేటువారి జోక్యమును నిరాధారపరచుటకు ప్రభుత్వమువారాలోచించినట్లు రాయిటరు ప్రతినిధికి అధికారరీత్యా తెలిసినది. ప్రభుత్వము వారి కట్టిఅభిప్రాయముకలుగుటయేగాక పొలిటికల్ సర్కిల్సులో ఉయలుదేరిన యీవదంతులు సత్యములు కొకన్నను అతిశయోక్తులుమాత్రము కొజాలవు.

### పత్రికలగతి

దేశమందు ప్రచురింపబడు పత్రికలన్నియు త్వరలోనే ప్రభుత్వము వారు నిలిపివేయుట కాజ్ఞాపించనున్నారని ప్రభుత్వము వారి పత్రికయందు ప్రకటితమైన వార్తవలన తెలియుచున్నది ఇదివరకు అపివేయబడిన పత్రికలలో ప్రభుత్వాభిప్రాయము విశదపరచుపత్రికలుగలవు త్వరలో యూదులవలన ప్రకటింపబడు యితర చిల్లర పత్రికలన్నియు అపివేయబడనున్నవి.

ముందు దేశమందు దేశపత్రికా కార్యాలయములందెవరు యూదుల నియమింపరాదనియు కావలసియున్న అర్యసాంప్రదాయకులగు రొమేనియనులు మాత్రమే యుంచవలయు ననియు, అల్పసంఖ్యాకుల పత్రికా కార్యాలయములందు అర్యసాంప్రదాయులే యేర్పడియుండవలయునని ఆజ్ఞలు ప్రకటింపబడినవి.

### దేశము దేశీయులకొరకే

ప్రధానామాత్యులగు గోగాగారు దేశీయులకిట్లు సందేశము తెలియపరచిరి:—

గోమేనియాదేశము రొమేనియనులకు మాత్రమేగలదు. ఎట్టి దౌర్జన్యమార్గములవలంబింపబడక సంపూర్ణముగ న్యాయము సమకూర్పబడును. పార్లమెంటు రద్దు చేయబడును. దేశమందిప్పుడున్న పత్రికలలో అనేకము లాపివేయబడును. అసభ్యముగు సారస్వతమును అంతమొందింపబడును. దేశమందలి పురపాలకసంఘము రద్దుచేయబడును. మానవతాగతి ప్రయాణవ్యయములు తగ్గించబడును. మానవజీవితమున కత్యంతవసర వస్తుసముదాయము—అనగా పంచదార, లోహము, ఉప్పు, సిమెంటుగలవి-చౌకచేయబడును. ఇతరజాతులలో చేయబడిన యొప్పిదములు గౌరవింపబడును. ముందు దేశమునందు మద్యద్రవ్యములు విక్రయించు ఆగత పత్రములు యూదుల కొసితేయబడును. దేశమందలి పరిశ్రమల పరిశీలించుటకు ప్రభుత్వాధికారులు నియమింపబడెదరు. దేశముపై దండెత్తిన అకలకొలది, లక్షలకొలది సైనికుల ప్రాణములు పరీక్షింపబడును. మేము మనుటయు, జాతిరక్షణకు బద్ధులము. మనుటశత్రువులుమాకు శత్రువులు.”

---

## భారత జాతీయ పరిషత్తుస్థాపన

## అఖిలభారత ప్రముఖుల సమావేశము

కాశీ డిసెం ౨౭

నేడు కాశీలో భారతమాతా మందిరమునందు భారతదేశమందలి వివిధప్రదేశములపండితులును, చార్త్రిక పరిశోధకులును చేరియున్న భారతీయాపీఠ పరిషత్తు (అకాడమీ) నెలకొల్పబడినది యీమహాసభ హిందీభాషలో జరుగుచున్నది.

వందేమాతరగీతము తరువాత డాక్టరు భగవాన్‌దాసు ఉపన్యసించుచు మహాసభయందు పాల్గొనుటకు కేతెంచిన ప్రముఖులకు స్వాగత మొసగిరి.

విద్యాశాఖామంత్రిగారగు శ్రీ ప్యారీలాల్‌శర్మగారు, (సంయుక్తరాష్ట్ర) ప్రధానమంత్రి శ్రీగోవింద వల్లభ పంతుగారి సమక్షమున మహాసభ ప్రారంభోత్సవము సల్పిరి. [illegible]

[illegible]

---

కథకులకు ఆహ్వానం:

## అఖిలాంధ్ర కథకుల సమ్మేళనము

ఫిబ్రవరి 4, 5 శుక్ర, శనివారములలో

శ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారి

ఆధ్వర్యమున

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమున

జరుగును.

---


# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర పుష్య శు॥ ౨

సోమవారము


# ఆర్థిక మహాసభ

గత సంవత్సరము మన హైదరాబాదు సైన్సుకాంగ్రెసు సమావేశమునకు స్వాగత మొసగియుండెను. ఈసారి ఆర్థికమహాసభ నునమధ్య జరిపించబడినది. ఇట్లే ముందును ఇతర వైజ్ఞానికమహాసభలునుమనరాష్ట్రమందు సమావేశపరచ బడవచ్చును. మనరాష్ట్రము రాజకీయముగ ఒక భిన్నమైన రాజ్యముగ నుండునంతకాలము అనేక విషయములయందు మనలను కట్టులలో నుంచు సంబంధములు ఇతరులతో అపేక్షించబడవుకాని, పలువురు వైజ్ఞానిక సంబంధముల త్రెంచుకొనుట కంటె ఉంచుకొనుటకే అభిలషించు చుదురు. కాబట్టి ప్రభువరేణ్యుడు మహాసభకు పంపిన సందేశమునందు “ఉస్మానియా విశ్వవిద్యాలయము నాపౌరులందు విజ్ఞానము ప్రసరింపజేయుటయేగాక భారతదేశమందలి విజ్ఞానులతో సంబంధము యేర్పరచుచున్నందులకు సంతోషించుచున్నాను.” అని చెప్పినపుడు సరిగా ప్రజాభిప్రాయమునే వ్యక్తపరచిరి. రజతోత్సవ సందర్భమున ప్రజలపక్షమున సమర్పించబడిన మొదటి వినతిపత్రమునకు సమాధానమిచ్చుచు ప్రభువుగారు మనరాష్ట్రమందు సైన్సు అభివృద్ధి పైన ఎంత అభిలాషను సూచించిరో, అంత యభిలాష నిపుడు వారు ఆర్థికమహాసభ కంపిన సందేశములో, మనరాష్ట్ర ఆర్థికసమస్యలయందు శాస్త్రీయదృష్టియొక్క అవసరముపై సూచించినారు. మనరాజధాని నగరమందు ఆర్థికమహాసభ సమావేశము ఏమి సాధించినను సాధించకున్నను “మహాసభ నా ప్రజలయందు ఆర్థిక వ్యవహారములను గురించియు, హైదరాబాదు ఆర్థిక అభ్యుదయమును గురించియు చక్కని భావము కలిగించునని ఆశించుచున్నాను” అను ప్రభువుగారి ఆశను తీర్చగలదని నమ్మవచ్చును. ప్రభువుగారి ఈ ఆశకు అనుగుణముగ, ఆహ్వానసంఘమువారు కేవలము శాస్త్రవేత్తలకు మాత్రమే బోధపడు కార్యక్రమముతో సంతృప్తిపడక ఇతరజనులకు రుచికరములైన ఉపన్యాసములను ప్రత్యేకముగ ఏర్పాటుచేసి యుండుట ప్రశంసించదగియున్నది.

మహాసభ కధ్యక్షతవహించిన మదరాసు విశ్వవిద్యాపీఠ వార్తాచార్యులు డాక్టరు పి. జె. థామస్‌గారు తమ ఉపన్యాస మందు భారతదేశముయొక్క ఆర్థికవ్యథల మూలకారణములను సరిగా వ్రేలుపెట్టి చూపించిరి. “ఏ వి ధమున జూపినను, ... ... భారతీయ సామాన్య జనుల జీవితసౌఖ్య ప్రమాణమును ఉన్నతదశకు వృద్ధిచేయుట అవసరము, మన భావి విధానమందు ఇది మనకు ప్రధాన విచారణీయముగ నుండవలెను.” అనిరి. అనగా వారిమాటలలోనే “... నేడు భారత దేశసమస్య తేరుకొనుట (ఆర్థిక దుస్థితివలన కలిగిన దుఃస్థలనుండి) మాత్రమే గాదు, మనకు చిరకాలమునుండియున్న దారిద్ర్య సమస్య, హీనజీవిత సౌఖ్య ప్రమాణ సమస్యలను పరిష్కరించుటయునై యున్నది.” ఇందుకువారు కారణములను విశదీకరించుచు మొదట దేశీయులందరికి చాలినన్ని అవసర వస్తువు లుత్పత్తి యగుటలేదనియు, అట్టి వస్తువులనుకొనగలశక్తి నిచ్చు ధనము కొద్దిమంది చేతులలోనే నిలచి అక్కరకురాకపోవుచున్నదనియు చెప్పి, ఇవుడీ దోషపరిహారమార్గమును “ఎక్కువ వస్తూత్పత్తి, మంచి విభజన — ఇది నేడు భారత దేశ సమస్య.” యని సూచించినపుడు ఆక్షేపించువారెవరును యుండబోరు.

ఇందుకు వస్తూత్పత్తిని గురించి చర్చించుచు, “భారతదేశమందు నేటి ఆర్థిక నిర్మాణము వ్యవసాయమువైపు అధిక భారముచే క్రుంగియున్నది.” అనియు, “ఇప్పటికంటె ఎక్కువమంది జనులను పరిశ్రమలపై ఆధారపడునట్లు చేయవలె” ననియుథామస్‌గారు చెప్పి, “కాని సంపూర్ణముగ యంత్రమయము చేయుటచే మన సమస్య పరిష్కారమగునని చెప్పినచో అందరును అంగీకరించరు” అని వివేకముతో గుర్తించిరి తుదకు తమ అభిప్రాయమును ఇట్లె తేల్చిరి. “కొన్ని పరిశ్రమలు ప్రధానముగ పెద్దలెక్కమీద పెద్ద కార్ఖానాలలో ... ... నిర్వహించ బడుచుండగలవు. కాని సాధారణ పరిశ్రమల విషయమున, చిన్నలెక్కలోకూడ అంతే అభివృద్ధిని సాధించవచ్చును.” “ఈ దేశమునకు పారిశ్రామిక విధానము (ఇండస్ట్రియలిజం) వలన కలుగు నైతిక శారీరిక బాధలను తప్పించవలసినచో, ఇదియే అవలంబించదగిన విధానమగును. వ్యవసాయమువైపు ఉత్తమ వ్యవసాయ పద్ధతులు, ఉత్తమ పశుపోషణ పద్ధతులు మంచి విత్తనములు, మంచి ఎరువు, సహకార విధానముపై సేద్యము, వ్యవసాయకునికి తక్కువ వడ్డీతో కావలసిన అప్పులనిచ్చుటకు సౌకర్యములు, క్రొత్త భూములను సేద్యముక్రిందికి దెచ్చుట అను అంశములు ఉత్పత్తిపరిమాణమును హెచ్చించగలవని చెప్పి వ్యవసాయకులకు అప్పులిచ్చు విషయమున ఒక హెచ్చరికను చేసిరి. “మనము అప్పులు సంపూర్ణముగా లాభప్రదములగు ప్రయోజనములకే ఒసగబడు విధానమును నిర్మించవలెను” అనిరి. ఇది శ్రద్ధగా గుర్తించదగినది. లాభప్రదములుకాని వివాహాదులకై యీయబడు అప్పులను న్యాయస్థానములు గుర్తించకుండునట్లు ఒక శాసనము చేసినను ధర్మమే యగును.

ఇట్లు వస్తూత్పత్తిని వృద్ధిచేయుటకు సూచనలనుచేసి, థామస్‌గారు, కొందరిచేతులలో మాత్రమే గడ్డకట్టియుండక దేశీయులందరికి సమముగ విభక్తమగునట్లు చేయుపద్ధతుల కింద ఉత్పత్తి వృద్ధి మార్గములక్రింద చెప్పబడిన యంశములే ఇందుకును ఉపయోగించగలవనిరి. నిజమే. అపరిమితోత్పత్తి పద్ధతిపై నిర్వహించబడు పెద్దకార్ఖానాల విధానమును వదలి, దేశమందు వివిధ ప్రాంతములందు చిన్నపరిశ్రమలను నిర్వహించునపుడు డబ్బంతయు కొద్దిమంది చేతులలో గడ్డకట్టుకొనుటకు అవకాశముండదు. పెద్దకార్ఖానాలలో కూడ పనివాండ్రకు తగిన జీవితసౌఖ్య ప్రమాణముండునట్లు శాసనములు చేయుటకు సూచించబడినది.

ఈసూచన లెన్నియైనను చేయవచ్చునుగాని, ఇప్పుడు ౧౦ ఏండ్లభారత దేశచరిత్రానుభవమువలన తలకెక్కినట్లు, ప్రభుత్వముయొక్క ఆర్థికవిధానము, ఇతరశాఖల విధానమును ఉత్పత్తి అభివృద్ధిని ప్రోత్సహించుటకును, దేశీయధనము సమవిభక్తమగునట్లు చేయుటకును, తోడ్పడునదిగ నున్ననేగాని ప్రయోజనముండదు. ప్రభుత్వమువారు అవసరము అయినపుడు పరిశ్రమలకు తగిన సంరక్షణము నొసగుటకును, పన్నులవిధానమందు మార్పులతో భారము భరించగలవారిపై పడునట్లు చేయుటకును సంసిద్ధులు కానిచో వ్యక్తుల ప్రయత్నములు విఫలములగును. కనుక ప్రజాభిప్రాయమునకు బాధ్యమగు ప్రభుత్వముయొక్క సహాయము ముఖ్యాతి ముఖ్యము. ఈవిషయమునుథామస్‌గారు గుర్తించక పోలేదు. “ప్రభుత్వము వారి ఆర్థికవిధానము (గ్రామజనులపై భారమును తగ్గించుటకు, (దేశీయధన) విభాగవైపరీత్యములను సర్దుటకును ఎంతో సహాయము చేయగలదు.” అనివారనిరి. ఉదాహరణార్థము మన రాష్ట్రములో పన్నులలో ఆదాయపుపన్నును, మరి కొన్ని ధనవంతులకు తగులు పన్నులను చేర్చి వ్యవసాయకులపై భారమునుతగ్గించుటకు అవకాశమున్నదని మాతలంపు.

సుంకములు వసూలుచేయకుండ వ్యాపారమును నిరాటంకముగ సాగనీయవలెనను సిద్ధాంతమును ఖండించుచు థామస్‌గారు కొందరు వవ్యమితవాద పక్షీయులు నేటి చిక్కునుండి తప్పించుకొనుటకు అంతర్జాతీయౌదార్యము మార్గమనిచెప్పిరి. కాని ఏ ఏ పరిశ్రమ లెక్కడ యుండవలసినది నిర్ణయించి, విక్రయస్థలములను నిష్పక్షపాతముగా పంచిపెట్టుటకు అంతర్జాతీయాధికారము గల సంస్థయేర్పడిననేగాని పైజెప్పిన విధానము సాగజాలదు.” అనిచెప్పిన మాటలు గమనించదగినవి అనగా భిన్నభిన్న రాజ్యప్రదేశములకు ఒకదానితో నొకదానికి అన్ని విషయములందును నిరాటంకమైన సంబంధము కుదురుట కష్టమని అర్థము.

వ్యవసాయ పరిశ్రమల అభివృద్ధియందు ప్రభుత్వమువారు నిర్వహించవలసిన ఇంకొకధర్మము థామస్‌గారిచే సూచించబడినది చాల ముఖ్యమైనది. వ్యవసాయ వృత్తిపై గాని పరిశ్రమలపై గాని అతిభారము పడకుండునట్లుచూడవలెను. వ్యవసాయవృత్తిలోనే దేశావసరములగు వివిధపంటలును వాటి వాటి అవసరపరిమితికి తగినట్లు ఉండవలెను. పరిశ్రమలలోను ఇట్టి సమత్వమే యుండవలెను; ఇందు ఏ ఏ పరిశ్రమ ఏ ఏ చోట్లలో ఎంతెంత పరిమాణములో నిర్వహించ దగునో ప్రభుత్వము వారు విచారించి నిర్ణయింపజేయవలెను. పరిశ్రమల విషయములో ఇంకను శిశుదశలోనున్న మనరాష్ట్రమందు కట్టి పరిశీలనచేసి నిర్ణయముచేయుటకు కాలము మించలేదు.

---

# ఈజిప్టు ప్రధాని పదచ్యుతి

## మహమూదు పాషా ప్రధానిగా నియమింపబడిరి

### రాజు, మంత్రుల విభేదములు పెంపొందుచుండుట

కయిరో: డిసెం. ౨౯

ఈజిప్టు ప్రభువగు ఫారూఖుగారు తమ అంతరంగిక సచివునిగా అలీమెహరు పాషాగారిని నియమించుకొనియున్నారు. ప్రభుత్వ ప్రధానమంత్రియగు నహాసు పాషాగారికిని,అలీమెహరు పాషాగారికినిగల పరస్పర విభేదములను రూపుమాపుటకై ఫారూఖుగారు ఉభయపక్ష మంత్రివర్గము నేర్పాటుచేయుటకు నహాసు పాషా గారిని కోరగా వారు నిరాకరించిరి. అందుపై ఫారూఖుగారు, నహాసు పాషాగారును, పూర్వ ప్రధానమంత్రి, శాసన సభాధ్యక్షుడు సెనేటు అధ్యక్షుడు, సభ్యులుగాగల యొక కమిటీని స్థాపించి విభేదములు తొలగు మార్గమాలోచింపవలయునని సంకల్పించిరి. కాని దీనికిగూడా నహాసుపాషాగా రంగీకరింపక, వీరికిగల విభేదములను శాసనసభ, సెనేటుసభవారితో లేక యీసభల అధ్యక్షులతో పరిష్కరించవలయుననియు లేదాపరస్పరముగా వీరిద్దరే ఆలోచించుకొనవలయుననియు ఫారూఖుగారికి నివేదించుకొనిరి. కాని ఇందుకు ఫారూఖుగారు సమాధానపడుటలేదు. పరిస్థితులు క్లిష్టముగా గలవు.

### ఈజిప్టు నూతన మంత్రి వర్గము

కయిరో: డిసెం. ౩౦

ఈజిప్టు ప్రధానామాత్యుల సూచనలను ఫారూఖుగారు నిరాకరించుచు ప్రస్తుత మంత్రివర్గమును పదచ్యుతి గావించి మహమ్మదుమహమూదు పాషాగారిని మంత్రివర్గమును నిర్మించుటకై కోరిరి మహమూదుపాషాగారు౧౯౨౮-౨౯ సంవత్సరములో ఈజిప్టు ప్రధాన మంత్రిగా నుండిరి. మహాఫారూఖుగారు మంత్రివర్గమును పదచ్యుతిగావించుచు యొసగిన ఫర్మానునందు మంత్రివర్గచర్యలను తీవ్రముగా విమర్శించిరి.

నూతనమంత్రివర్గమునందు మహమ్మదుమహమూదుపాషా, యేహ్యాపాషా, సిద్దీఖీపాషాగారలు మంత్రులుగా నున్నారు. మహమ్మదు మహమూదుపాషాగారు ప్రధాన మంత్రులుగా నుండుటయేగాక, దేశాంగశాఖా మంత్రిత్వభారమునుగూడ వహించియున్నారు. యేహ్యాపాషాగారికి విదేశాంగశాఖ, సిద్దీఖీపాషాగారికి ఆర్థికశాఖలు వశపరుపబడినవి.

### నూతన మంత్రీవర్గ ప్రథమ చర్య.

నూతనమంత్రివర్గము వారు గావించిన మొదటి కార్యము సర్వవిధ కవచధారుల చర్యలను ప్రజాక్షేమమునకు బంగకరములని నిర్ణయించుచు ఆజ్ఞలనొసగుటతో ప్రారంభమైనది. వెంటనే యీయాజ్ఞలు ఈజిప్టునందాచరణలోనికి దేబడినవి.

దేశమునందు శాంతి నెలకొల్పుటకు అవసర విధానము అవలంభింప బడుచున్నది.

---

ఇవి మొత్తముమీద భారత దేశముఖ్యసమస్య పరిష్కార విషయమున గుర్తుంచుకొనదగిన ప్రధానానుసరణ సూత్రములు. వీటి ననుసరించి సమర్థులుశ్రద్ధావంతులునుపనిజరుపుచో కాలయోగమున భారత దేశజనుల దారిద్ర్యభారమేల తగ్గదో కారణములేదు. హైదరాబాదుయొక్క ముఖ్యార్థికసమస్యయావద్భారతార్థిక సమస్యకంటె భిన్నమైనదికాదు. భేదమున్నచో, సరిచేయవలసినఅంశములు హైదరాబాదు నందు యావద్భారత దేశమునందుకంటె చాల బలవత్తరములై యుండుటలోనే ఆ భేదముండును. పరిమాణ భేదము మాత్రమేగాని,వస్తుభేదముకాదు. ఉత్పత్తిలో పరిశ్రమలును వ్యవసాయమును పవియుండవలసిన స్థితిలో అవిలేకుండుట యావద్భారత దేశములోకంటె హైదరాబాదులో హెచ్చు. ధన విభజనలో కూడ యావద్భారత దేశములోకంటె మనరాష్ట్రమందే హెచ్చుతగ్గులు అపరిమితములని మాకు దృఢమైన అనుమానము థామస్‌గారు సూచించినసూత్రములను అంగీకరించి, మన రాష్ట్రములో దారిద్ర్యవ్యాప్తిని తొలగించుటకు అవలంబించవలసిన విధానమును విపులముగ నిర్ణయించుట మనరాష్ట్రియార్థిక వేత్తల పని. ఎప్పుడో రెండుమూడు సమావేశములుజరిపి ఇవుడు నిద్రించుచున్నట్టున్న హైదరాబాదు ఆర్థికసంఘము వారు ఇపుడు అఖిలభారతార్థిక సమావేశము వల్ల కలిగిన ప్రభోధముచే, ఎట్లు నడుము కట్టుదురో చూడవలసియున్నది.

---

## సామ్యూల్ ప్రభువు ఆగమనము

హైదరాబాదు డిసెం ౩౧

లార్డు సామ్యూలుగారు పతిపత్నీసమేతముగా భారతశాసనము: సమాఖ్య ఫలితమునుగూర్చి పరిశీలించుటకై భారతదేశమునందలి ముఖ్యపట్టణములను సందర్శించుచు ౨౦ వ తేదివాడీచటికి వచ్చిరి, వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయ భవనములను, ఇతర చారిత్రిక ప్రదేశములను సందర్శించిరి. మాలెగాపూర జాతరను సందర్శించుటకై వెడలి శుక్రవారమునాడు తిరిగి హైదరాబాదు విచ్చేసిరి, అదివారమునాడు వీరు కలకత్తా వెడలిరి.

సామ్యూలుప్రభువు హైద్రాబాదు నివాస సందర్భమున ప్రధానమంత్రులగు సర్ అక్బర్ హైదరీగారిని, మరియితరఉన్నతాధికారులతో సంప్రతించి సమాఖ్యలో చేరుసమస్య విషయమున హైదరాబాదు ప్రభుత్వమువారి వైఖరిని గూర్చి సంభాషించిరని తెలియుచున్నది. కాని సామ్యూల్ ప్రభువుగారు స్థానిక ప్రజానాయకులతో యీవిషయమున సంప్రతించి వారి అభిప్రాయములను తెలిసికొనకుండుట ఆశ్చర్యము కలుగజేసినది. ప్రస్తుతము కలకత్తాలోనున్న లార్డులోథియన్‌గారు రాబోవు వారమునందు విచ్చేయనున్నారని తెలియుచున్నది.

---

## అఖిల భారత కాంగ్రెసు కార్యకారిణీసభ

బొంబాయి జన ౨

ఇచ్చట సమావేశముకానున్న అఖిలభారత కాంగ్రెసు కార్యకారిణీసభయందు పాల్గొనుటకు బాబురాజేంద్రప్రసాదు, శరచ్చంద్రబోసు, శ్రీమతి సరోజనీనాయుడు గారలు నిన్న యిచ్చటికి దయచేసిరి. నేడు మధ్యాహ్నము బలాభాయి దేశాయిగారి భవనమునందు సభ సమావేశమగును. ౧౫ జనవరివరకు స్వదేశమునకు రాలేకపోయని శ్రీ సుభాసుచంద్రబోసు గారు శరచ్చంద్ర బోసుగారిని తంతిద్వారా విచారించినటులను, మహాత్ముని విచారించి వివరముగా తంతిమూలకమున తెలుపుటకు కోరిరి.

ఈసమావేశమునందు కాంగ్రెసుమంత్రాంగములవారి కార్యములు పరిశీలింపబడుననియు హరిపూర్ కాంగ్రెసునందు చర్చింపబడు తీర్మానములు చర్చింపబడుననియు తెలియుచున్నది. సర్దారుపటేలు మదరాసునుండి యిచ్చటికరుదెంచినారు. పండితుడు నేడు మధ్యాహ్నము రాగలడు.

---

# కడపటివార్తలు

## ఆబీకిస్తుపై రెండణాలమాఫీ

హైద్రాబాదు జన: ౨

ఈ సంవత్సరము సకాలవర్షములు లేనందున ఆబీకిస్తుపై రూపాయికి రెండణాలమాఫీ యొసగుటకు ప్రభుత్వసభవారి సూచన ననుసరించి మ ఘ.వ. శ్రీ నిజాం ప్రభువుగారు ఆజ్ఞాపించిరి. ఈఆజ్ఞ ఖాల్సా, గైరుఖాల్సా (జాగీరు సంస్థానములు మొదలగు ప్రదేశములలో) అన్నింటిలో అమలులోనికి వచ్చును. జిల్లా అధికారులకు ఆజ్ఞలు పంపబడినవి. మొతెమదీ మాల్గుజారి మురాసిలానిషాన్ ౭౮ నుండి ౭౭, [illegible]

# 'భారత దేశము భారతీయముగా నుండవలెను.'

## హిందువులకు ప్రత్యేకహక్కు లవసరములేదు

వినాయక దామోదర సావర్కరుగారి ఉపన్యాసము

అహమదాబాదు డిసెం: ౩౧

"దేశములో మేము అత్యధిక సంఖ్యాకుల ముగానున్నాము. అయినను హిందువులకు మేము ప్రత్యేకహక్కులు కావలయునని కోరుటలేదు. భారత దేశమునందలి యితర సంఘములవారి హక్కులకు భంగము కలిగింపమని మహమ్మదీయులు వాగ్దానము నొసగినచో మహమ్మదీయుల మత, భాషా, విజ్ఞానములకు ప్రత్యేకరక్షణ లొసగుటకు హిందువులు సంసిద్ధులైయున్నారు."అని నేడుఇచట సమావేశమైన ౧౯వ హిందూమహాసభకు అధ్యక్షత వహించుచు శ్రీ వినాయక దామోదర సావర్కరుగారు ప్రకటించిరి. సావర్కరుగారు తమ యుపన్యాసము నుపక్రమించుచు "భారత దేశము అచ్చముగా భారతీయముగానే యుండవలయును. మత, జాతి విచక్షతల నాధారముచేసుకొని వోటింగు పద్ధతులలోను, ఉద్యోగములలోను, పన్నుల విధానములలోను తారతమ్య ముండగూడదు. అన్ని మతములవారును సమానముగా చూడవలయును. అందరును యోగ్యతలను బట్టియు, అర్హతలను బట్టియు చూడబడవలయును. ఇతర దేశములందువలె అత్యధిక సంఖ్యాకుల జాతీయభాషగా పరిగణించు భాషనే జాతీయభాషగా యేర్పరుపవలయును. మతాభిమానదృష్టితో భాషను,లిపిని మార్పగూడదు." అని నుడివిరి.

## కాంగ్రెసు మంత్రివర్గములు స్వతంత్రములు

## పౌరస్వత్వములకు, స్వైర విహారములకు భేదము గలదు

మదరాసు డిసెం. ౩౧

"కాంగ్రెసు మంత్రివర్గము శాసనసభలోని కాంగ్రెసు పక్షమువల్లగాక తదితరుల అజ్ఞలకు లోబడి ప్రవర్తించుచున్నదను ఆరోపణ సత్యదూరమైనది. కాంగ్రెసు మంత్రివర్గమునకు అర్హము అనర్హములగు కార్యములను సూచించుచు, అభిప్రాయములను మాత్రమే కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘమొసగుచున్నది. అంతకుమించి యెట్టి జోక్యమును గలిగించుటలేదు. నియోజకవర్గములు మాత్రమే మంత్రివర్గ వ్యవహారములందు జోక్యమును గల్పించుకొన అర్హములు. అయినను వర్కింగుకమిటీకిగూడ కొంత అధికారముగలదు. మంత్రులచర్యలు మాకు తృప్తికరముగా నున్నంతకాలము వారిని తొలగింపజాలము. తొలగింపగూడదు." అని నేడు సర్దారు వల్లభభాయి పటేలుగారు ప్రకటించిరి.

పౌరస్వత్వములను గురించి సర్దారుగారు ప్రస్తావించుచు "సామాన్య పౌరస్వత్వములకును నేరస్థుల స్వైర విహారములకును చాల వ్యత్యాసముకలదనియు, అవ్యత్యాసమును గమనించి నేరస్థుల స్వేచ్ఛను అరికట్టవలెనని యున్నదని"యు నుడివిరి.

## ఋణపరిష్కారచట్టము: ఉపసంఘ నివేదిక

మదరాసు: డిసెం ౩౧

మదరాసు ప్రధానమంత్రులగు శ్రీరాజగోపాలాచారిగారిచేత శాసన సభయందు ప్రతిపాదింపబడిన ఋణపరిష్కార చట్టమునుగూర్చి డిసెంబరు ౨౧వ తేదివాడు యేర్పరుపబడిన సంయుక్తసంఘమువారు ౨౪వ తేదినుండి వరుసగా ఈచట్టమునందు గావింపబడిన సవరణలను పరిశీలించి నేడు శాసనసభ సమక్షమున తమనివేదికను అర్పించుకొనిరి. ఈ సంయుక్త సంఘమువారు చట్టమునందు గావింపబడిన అసంఖ్యాక సవరణలను పరిశీలించినపిమ్మట ఇందు అనేక సవరణలు గావించిరి, ఇప్పుడు ప్రవేశపెట్టబడిన చిత్తుచట్టమునందు ౧౯౩౨ అక్టోబరు ౧ నుండి వడ్డీప్రారంభింప బడవలయుననియు, ఏవిధముగాను వడ్డీ నూటికి ఆరురూపాయీలకంటె మించగూడదనియు స్పష్టపరచిరి.

## జవాహర్ జిన్నా సంప్రతింపులు?

డా. సయ్యదుమహమూద్ ప్రయత్నము

లక్నో డిసెం: ౩౧

డా. సయ్యదుమహమూద్‌గారి నిరంతర ప్రయత్నమువలన రెండు మూడు రోజులలో జిన్నా, జవాహర్లాలు నెహ్రూగారు కలిసి మాటలాడుట కంగీకరించినటుల "వర్తమాన" పత్రికా విలేఖరి తెలుపుచున్నాడు. ఉభయుల మధ్య ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచున్నవి. జనవరి మొదటివారములో జిన్నాగారు అలహాబాదకు రానున్నారు. డాక్టరుదినదకచ్చట నే యుండెదరు. బహుశః షౌకతాలి అదివరకచ్చటికి రావచ్చును. అలహాబాద సంప్రతింపులు మొట్టమొదటివైనను చివర పరిష్కారములు మాత్రము బొంబాయి నగరమునందు జరుగవచ్చును.

## కెంటన్‌పై దాడి

కెన్టన్ డిస ౩౧

తిరిగి యీరోజు జపాను విమానములనుండి కెంటన్‌నగరము ముట్టడింపబడినది. రూటర్ ప్రతినిధి కెన్టను గవర్నరుగారితో సంభాషించుచుండిన సందర్భమున విమానముల ముట్టడిధ్వనులు నగరమునందంతట ప్రతిధ్వనింప మొదలయ్యెను రాష్ట్రీయ ప్రభుత్వపు కేంద్రస్థానముపై విమానములనుండి బాంబులు విసరబడెను. పరిసర ప్రాంతములందు సుమారు ౩౦ విమానములవరకు కెగురుచుండెను. ప్రభుత్వాధికారులనేకులు సిమెంటు కాంక్రీటువలన తయారుచేసిన సొరంగములందు తలదాచుకొనియుండిరి.



# రూమేన్యాలో ఫ్యాసిస్టురాజ్యము

## ౨ లక్షలదౌర్జన్య పూరితుల సైన్యము

పార్లమెంటు, పురపాలక సంఘముల అంతము

వయానా డిస ౩౧

రూమాన్యా యందలి ప్రస్తుతపరిస్థితులు ఫ్యాసిస్టుల విప్లవరూపము దాల్చినది. తదనుకూలములగుకొన్ని సత్వర నిశ్చయములు తీర్మానింపబడినవి. జరుగుచున్న యెన్నికలు కొన్ని శాస్త్రీయ కారణములవలన ఆపివేయబడినవి. ఇంతేగాక క్రొత్తగాఏర్పడిన పార్లమెంటుసహిత మెత్తివేయబడ నున్నటుల గలదు. రాష్ట్రీయ ప్రభుత్వములందు సహితము ప్రస్తుతమున్న అధికారుల స్థానములందు ఫ్యాసిస్టు లేర్పడనున్నటుల అనుమానము గలుగుచున్నది. పురపాలక సంఘములన్నియు నెత్తివేయబడనున్నవి. (దౌర్జన్య సిద్ధాంతములు గలిగిన) ౨ లక్షలు ప్రారంభోపర్సు సైనికదళమొకటి, ప్రచారమంత్రియొకడు యేర్పడనున్నాడు.

## × గురి నిర్బంధము

లాహోరు డిస ౩౧

షహీదుగంజ మసీదు హడావుడిలో విపరీతమగుచలి బాధించుచున్నను, వర్షము కురియుచున్నను ౫గురు వాలంటీరులు వెళ్లుటవలన పోలీసువారు వారిని అరెస్టుచేసిరి. కరీంబక్షు మసీదునుండి యూరేగింపుబయలుదేరినను ప్రజలుమాత్ర మంతగా లేకుండిరి. ఇంతవరకీ సందర్భములో అరెస్టుఅయినవారిసంఖ్య ౪౨.

## మహాత్ముని ఆరోగ్యము

రక్తపుపోటు హెచ్చు తగ్గులు

బొంబాయి జన ౧

మహాత్ముని ఆరోగ్యవిషయమై మీవారమునందంతగా వివరింపదగిన దేదియు లేదని దేశాయి హరిజన్ పత్రికలో వ్రాయుచున్నారు. రక్తపుపోటు హెచ్చుతగ్గుల గురించి అనేక కారణములు గలవనియు, జాహూరాయం దుండుటవలన ఆరోగ్యము చెడినన్నను చెప్పదగినంత అభివృద్ధిమాత్రము కలుగలేదనవచ్చును.

## నెహ్రూ పండితుడు

డిల్లి డిసం: ౩౧

నెడు సాయంకాలము పండితుడు అలీఘడునుండి తిరిగివచ్చిరి. రేపు ఉదయము యిచ్చటినుండి వీరుబొంబాయి వెళ్లెదరు.

## పట్టాభిగారి ఆగమన వార్త సత్యబద్ధము

పత్రికలలో ప్రకటింపబడిన వార్త నిజమైనది.

హైదరాబాదు: జనవరి ౨

గోలకొండ పత్రికయొక్క డిసెంబరు ౩౦వ తేదినాటి సంచికలో ఆంధ్రమహాసభ స్థాయి సంఘకార్యదర్శులగు శ్రీమందుముల రామచంద్రరావుగారు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి నిజాంరాష్ట్ర పర్యటన సంబంధమున ఆంధ్రపత్రికలో ప్రకటింపబడినవార్తనుగూర్చిన ప్రకటనపై స్థాయిసంఘ కార్యదర్శులకు ఆంధ్రపత్రిక స్థానికవిలేఖరియగు శ్రీమంగు శేషగిరిరావుగారు ఒకలేఖనువ్రాయుచు దానిప్రతిని మాకు ప్రకటనార్థము పంపియున్నారు. లేఖను దిగువ నుదహరించుచున్నాము:—

శ్రీ స్థాయిసంఘ కార్యదర్శిగారి సముఖమునకు

ఆర్యవర్యా

తాము నేటి గోలకొండపత్రికలో శ్రీపట్టాభిగారి నిజాంరాష్ట్ర పర్యటనముగూర్చి ప్రకటించిన అధికారప్రకటనను గాంచితిని. మీకు, ఆంధ్రపత్రికయందు ప్రకటింపబడిన వార్తవలన అనవసరముగా అపోహ కలిగినదని నివేదించుకొనవలసి వచ్చినందులకు చింతించుచున్నాను. ప్రకటితవార్తయం దెచ్చటను శ్రీపట్టాభిగారిని మీరాహ్వానించితిరనివ్రాయబడలేదు. ఆంధ్రపత్రికయందు ప్రకటింపబడినవార్త సంపూర్ణముగా సత్యబద్ధమైనదని తమకు మనవిచేయుచు మీరుగావించిన ప్రకటన అపోహాపూర్వకమైనదని నివేదించుకొనుచున్నాను.

దీనిప్రతిప్రకటనార్థము శ్రీగోలకొండ పత్రికాసంపాదకులకు పంపుకొనుచున్నాను.

విధేయుడు

మంగు శేషగిరిరావు

## విద్రోహులు టెరోలులో

సలామాంకా జన ౧

౩౧ డిసంబరు సాయంకాలము నాలుగుగంటలకు విద్రోహుల సైన్యము నగరమునందు ప్రవేశించినటుల ప్రభుత్వమువారు ప్రకటించిరి.

## జీతముల తగ్గింపు

మదరాసు ప్రభుత్వమువారి ప్రకటన

మదరాసు జన ౧

ప్రభుత్వమువారు ప్రావిన్షిల్ (రాష్ట్రీయ) సబ్ ఆర్డినేటు ఉద్యోగుల జీతములు తగ్గించినటుల ప్రకటనవలన తెలుపుచున్నారు.

ధరలు తగ్గిపోవుటచే ౧౯౩౩-౩౪ సంIIలలో ప్రావిన్షిల్, సబ్ ఆర్డినేటు ఉద్యోగుల జీతముల పద్ధతిలో తగ్గింపు చేయబడియుండెను. ఈ తగ్గింపుసహితము యెక్కువగానే గలదు. దీనియందింకను తగ్గింపుఅవసరము నెలకు ౧౦౦ రూప్యములకన్న మించియున్న జీతముల తగ్గింపులిటులుంచబడును.

సబ్ ఆర్డినెటుసర్వీస్ — నూటికి మించి ౨౦౦ వరకుగల జీతములలో ప్రతిశతి ౫ తగ్గింపు. ౨౦౦ అకు పైన ప్రతిశతి ౭౫ తగ్గింపు.

ప్రావిన్షిల్ సర్వీస్— ౨౦౦ లు, యింతకన్న తక్కువజీతములలో ప్రతిశతి ౫. రు ౨౦౦ నుండి ౩౦౦ వరకు ప్రతిశతి ౭౫. రు ౩౦౦— ౫౦౦ వరకు ప్రతిశతి ౧౫. ౫౦౦—౧,౦౦౦ వరకు ప్రతిశతి ౨౦; ౧౦౦౦ కన్న మించినవానికి ప్రతిశతి ౩౦.

ఈపద్ధతి ౧ జనవరి ౧౯౩౮ నుండి అమలులోనికి తేబడును.

## టెరోలులో సమరము సాగుచునేయున్నది

సారాగోజ జన ౧

విద్రోహులవద్ద ఆయుధ సామగ్రియే గాక ఆహార వస్తుసముదాయము చాలినంత సమకూర్చబడియున్నందున తిరిగి కొంతకాలమువరకవిచ్ఛిన్నముగా యుద్ధముసాగునని నిస్సంశయ వార్తవలన తెలియుచున్నది. వీరు ప్రభుత్వమువారిసేవల ముట్టడించినటులను, టెరోలునకు పశ్చిమమున ఒక సైనికు లంతమొందినటుల గలదు.

టెరోలునగరమును ఆవరించియున్న సైనికదళమునకు విశ్రాంతి కలిగించుటకు విద్రోహసైనికులు తీవ్రముగా కృషి సలుపుచున్నటులను, ప్రభుత్వ సైనికులకు విజయము సమకూరు సందర్భమున విద్రోహులకు యితర రంగములనుండి అసమయమున సైనికసహాయ మరుదెంచుటచే తీవ్రమగు పోరాటము జరిగినది అదివరకు ప్రభుత్వమువారి ఆధీనమందున్న ప్రదేశము తీవ్రసమరానంతరము తిరిగి వారిఅధీనమునందేగలదు.

## జర్మనియొక్క సమరశక్తి

బర్లిన్ డిస ౩౧

నూతనసంవత్సర సందేశము హెర్ హిట్లరు తనదేశీయుల కొరింగించుచు యిటుల వివరపరచిరి:—

౧౯౩౮ సంII దేశమందలి సమరశక్తి, యుద్ధబలము హెచ్చించుట ముఖ్య కర్తవ్యము. నేటియీ పరతంత్ర యుగమునందు భావికాలములో శాంతిసంరక్షణకు దేశము శక్తివంతమైయుండు టత్యవసరము. ప్రపంచమందలి యితరభాగము లీశాంతిపరిష్కారమునకు దృష్టి మరల్చుటకు అభిలషించుచున్నాను.

## చరిత్రయందు మరొక అపూర్వ అధ్యాయము

కాయిరో డిస ౩౧

విషయమునందెంత సత్యమున్నదో యిదమిద్ధముగా నిర్ణయించ వీలులేకున్నను అసత్యమని మానుకొనుటకు వీలులేదు. ఇంగ్లాండునందు ఎడ్వర్డు-సింప్సన్ వివాహవిషయమున ప్రాచీన సాంప్రదాయులు క్లిష్టపరిస్థితు లేర్పడినటులను, ఎడ్వర్డు (డ్యూక్ అఫ్ విండ్సర్) ప్రేమరహస్యమునెరిగి సూర్యుడస్తమించని అఖండ సామ్రాజ్యమును తృణప్రాయముగా పరిత్యజించి ప్రేమరాజ్యమున కేకైక చక్రవర్తిపదవి బడసినటు ఈ యీజిప్టునందు అట్టిపరిస్థితులే ప్రస్తుత మేర్పడినటుల అరబీపత్రిక అనుమానించుచున్నవి.

ఈజిప్టు ప్రాచీన సాంప్రదాయములు రాజకీయపక్షమువారు షాహ ఫారూఖ్, ఫరీదాజుల్ఫకార్ వివాహమునకు పూర్తిగా ప్రతికూలురైయున్నారు. మతావేశకులు సహితము వీరికి తాళమువేయుచున్నాడు. కాని షాహకు ప్రతికూలమును యేమాత్రము గమనించకుండుటయేగాక "అవసరమేతెంచిన రాజ్యము, సింహాసనము పరిత్యజింతునుగాని నే నిర్ణయించుకొనిన వివాహమునుమాత్రము వదలుకొనజాలన"ని దేశమందలి సనాతనులకు, మతావేశములకు నిష్కర్షగా తెలియపరచుచున్నాడు. ఈ విషయము నిజమేయైన ప్రభువుగారి యీపట్టింపువలన దేశమునందు ముఖ్యముగా మతావేశకులలో గొప్ప సంచలన మేర్పడగలదు.

## హిందీ నిర్బంధమువద్దు

(కెల కేజీ రచవాయి)

ప్పీ ఖేదమే. ఆటువంటప్పుడు అంతా ఒక్కొటే హిందీ నేర్చుకొనండి అనుటకాక్రము న మంజసము గాదు. హిందీ సులభమైనభాష గనుక తేలికగావచ్చేభాష గనుక నేర్చుకొను మందురాయన్న స్వరాజ్యము వచ్చినపిమ్మట అవసరము కలిగినప్పుడు నేర్చుకొనవచ్చును గాదా? ఆ సమయమునకే ఉన్నత తరగతులందు ఐచ్ఛిక విషయముగా నుంచిన అంత బాధ యుండదు.

భారతదేశములో అంతర్రాష్ట్రీయభాష (ఇంటర్ నేషనల్ లాంగ్వేజి) ఒకటి ఉండవలెను. అది హిందీతప్ప వేరుకాజాలదు. కనుక నిర్బంధముగా నభ్యసించవలసినదని వారి వాదము. భారతదేశములో ప్రస్తుతము ఇంగ్లీషు తెలిసినవారిసంఖ్యను దృష్టియందుంచుకొని అంతర్రాష్ట్రీయభాష హిందీకావలయునా లేక అంతర్జాతీయభాష యగు ఇంగ్లీషే మనము అంతర్రాష్ట్రీయభాషగా నేర్చుకొనుట శ్రేయమా అనువదొక వాదనీయాంశము అది అటుండ నిచ్చి హిందీకి ఆ అంతర్రాష్ట్రీయ దర్జా లభించినదనే ఒప్పుకొనినను దానిని దేశపు ప్రతి మూల మూలలలో నిర్బంధముగా నూరిపోయుట ఎట్టి న్యాయము! యూరపులో ఫ్రెంచి సాధారణ భాషగదా! మరి ఆకారణమున యూరపులోని ప్రతిబాలునికి కాళ్లు చేతులు బట్టి ఫ్రెంచి పోయుదమనిన చెప్పుచ్చుకొనలూ? మరి భారతదేశములోని సాధారణభాషను అఖిలభారత భారతీయ నాయకులు కాంగ్రెసువారు కేంద్రప్రభుత్వములో మాత్రములోమాత్రముద్యోగముల నాశించు ఏకొందరోతప్ప తక్కినవారు నేర్చుకొనవలసిన అవసరములేదని ఇదివరకే సూచించియున్నాను. కేవలము వ్యవహారమునకైన ప్రస్తుతము హిందీరావంతమాత్రమున ఏమంత లోటు కలిగినది? మన తాత ముత్తవలు పండితుల వద్ద కరదాలుదిట్టి రాష్ట్రభాషా పరీక్షలలో ఉత్తీర్ణులు కాకపోయనే ఏలాటి ఆయాసమును లేక రామేశ్వరమునుండి బదరీవరకు తీర్థయాత్రలు చేసివచ్చిరే!

హిందీప్రచారమువలన మాతృభాషలకు నష్టము కలుగుచున్నదాయని హిందీ ప్రచారక సంఘములుగాని, కాంగ్రెసు నాయకులు గాని విచారించినారా యనుట సందేహమే. మహాత్ముడు మాతృభాషలస్థానము వానికుంచి హిందీ నేర్చుమని సెలవిచ్చియుండిరి. అట్టే మహాత్ముని అభిప్రాయప్రకారము ప్రచారకసంఘములు హిందీనేర్పుటకుముందు మాతృభాషాజ్ఞానము కలదాయని విమర్శించవలయునని కాంగ్రెసు ఏమైన కట్టుదిట్టములు చేసినదా? ప్రతి పల్లెటూరిలో హిందీతరగతుల నారంభించుటకుముందు హిందీ పాఠశాలలు నెలకొల్పుటకు ముందు అపల్లెటూరిలో మాతృభాషలో పాఠశాలలున్నవాయని పరిశీలించవలయునని ఏమైన కట్టుదిట్టములుగాని తీర్మానములుగాని చేసినదా? ఏమియులేదు. మాతృభాషలకేమియు ప్రోత్సాహము లేకపోవుట చాలదా! మాతృభాషలు మూలబడుటను నిజముగా కాంగ్రెసు ఉద్దేశము దేశయభాషల అభివృద్ధిపరచుటయే అయిన ఏవ్యక్తికిగాని మాతృభాషాజ్ఞానము తగినంత యుండినతేగాని హిందీ నేర్పరాదనని అఖిలభారత కాంగ్రెసు తీర్మానించినచో మనమందరము కొంతవరకు హర్షింపదగినది.

ఆంధ్రులెప్పుడు గొర్రెదాటుస్వభావము. ఉత్తర హిందూస్థానపు భయ్యాలు చెప్పినది వేదవాక్యము. తమలోని తీర్థము. వీరు తమ స్వంతబుద్ధుల నుపయోగించి మంచిచెడ్డల నాలోచించు నలవాటు తక్కువ.

అక్కడ ఎక్కడనో ఒక చెట్టుక్రింద కూర్చొని మహాత్ముడు హిందీ ప్రజలు నేర్చుకొనుట మంచిది అని అన్నాడో లేదో అప్పుడే అరంభమాయె"ఆంధ్రులు హిందీ నేర్చుకొనుట. వీళ్లు కరువుసముందే. కాలానికిముందే. క్రొత్త బిచ్చగాడు పొద్దెరుగడన్నట్లు ఇక రాత్రింబవలు హిందీపారాయణము. భార్యాబిడ్డలతో కూడ హిందీలోనే మాట్లాడుట. పైగా హిందీ ప్రచారకసంఘములు కూడ తోడగుచున్నవి. మొత్తము మీద ఆంధ్రులు వ్యక్తిత్వమును గోలుపోయి హిందీకి బలియగుచున్నారు. మొన్న మొన్ననే మద్రాసుబీచిలో అన్నామలై విశ్వవిద్యాలయపు పంతుడగు శ్రీ సుబ్రహ్మణ్య భారతిగారి అధ్యక్షతక్రింద అరవవారందరు సమావేశమైరి వారు కొంత ముందువెనుక లాలోచిందువారు గనుక హిందీనేర్చుకొనుమని మహాత్ముడు చెప్పిన ంతమాత్రమున నేర్చుకొనక తమకు దానివలన నష్టములు కలుగనున్నవని హిందీ నిర్బంధము తమకనవసరమని తీర్మానించిరి. ఆసందర్భములో అధ్యక్షమహాశయుడు అన్నట్లు ఆంధ్రదేశములో ఆంధ్రునికి ఆంధ్రుడుగా బ్రతుకనియ్యని స్వాతంత్ర్యము గాని, స్వరాజ్యముగాని వచ్చినట్లయిన దానికొక నమస్కారమర్పించవలెను

మనుష్యులందరికి ఒకతల ఉండిన రావణునికి పదితలలున్నట్లు భాషలన్నిటికి ఒకటే లిపి ఉండిన "హిందీ" అనునది అట్లు పిలువబడక "హిందూస్థాని" అని పిలువబడి మూడు లిపులు ఉండునని నెహ్రూపండితుని ఇటీవలి ఫర్మాను. అవి ఉర్దూ,హిందీ, ఇంగ్లీషు ఇక "హిందూస్థాని" నేర్చుకొనిన ఆ మూడు లిపులతోబాటు నేర్చుకొనుట తప్పనిసరి.

ఈమూడు లిపులతోనే హిందూస్థానిభాష నిలుచునో, లేక ఇంక యేలిపులు ఎక్కువగా కల్పింపబడునో తెలతేదు. ఈపరిస్థితిలో దక్షిణ భారతీయులు మిన్నకుండి మాతృభాషోద్ధరణముతోపాటు మాతృదేశోద్ధరణమునకు పాటుపడగలరని ఆశించుచున్నాను. హిందీని నిర్బంధముగా దక్షిణభారతీయులకు అంటగట్టి అవస్థపెట్టకుందురుగాక యని కాంగ్రెసు నాయకులైన వారికి వినయపూర్వక విజ్ఞాపన చేయుచు విరమించుచున్నాను.

## దేశీయారోగ్య సంరక్షణ ప్రణాళిక ప్రయత్నము

ప్రతిచోటను ఆరోగ్యసేవకదళముల ఏర్పాటు

అఖిలభారత వైద్యమహాసభ తీర్మానములు

మదరాసు డిస ౨౮

అఖిల భారతీయ వైద్యమహాసభ యొక్క ౧౪ వ సమావేశము నేటిఉదయము డాక్టర్ బిధన్ చంద్రరాయ్ గారి అధ్యక్షతన ప్రారంభమయ్యెను. కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరించినతరువాత సమావేశమైన మొదటిసభయిది. భారతీయవైద్యసంఘము (ఇండియన్ మెడికల్ అసోసియేషను) ౧౪ ఏండ్లక్రిందట స్థాపించబడిన తర్వాత మదరాసులోజరుగుచున్న మొదటిసమావేశమిది. ఈ సమావేశము యొక్క ఆహ్వానసంఘాధ్యక్షులగు లెఫ్టినెంటు కర్నల్ కె. జి. పాండలేగారు మదరాసు ప్రభుత్వ వైద్యశాఖలో పనిచేసినవారు- వీరుతమ ఉపన్యాసమందు"ఇండియన్ మెడికల్ సర్వీసు" అనుదానిని ఉంచి, వైద్యశాఖలో పెద్ద ఉద్యోగముల నన్నిటిని ఆ సర్వీసులో చేరినవారికిచ్చుపద్ధతిని, ఈపద్ధతి సాకుక్రింద యూరపీయులకు పెద్దఉద్యోగములనిచ్చుచు; భారతీయులెంత సమర్థులైనను వారలను పైకెక్కనీయకుండుటకు అవకాశము కలుగకుండుటకును ఈవైద్యులను తెలివితేటలనుబట్టిగాక వానినే షను పద్ధతిచే నియోగించుటకు ఉంచబడిన అవకాశములను తీవ్రముగ ఖండించిరి. సభాప్రారంభోపన్యాసకులగు డాక్టర్ రాజన్ గారు మదరాసు వైద్యశాఖమంత్రి, ఇట్లుబాధ్యతగల ప్రభుత్వమంత్రి ప్రారంభోత్సవము జరుపుటకిది మొదటిసారి డాక్టర్ రాజన్ గారు పాండలేగారి భావములను బలపరచిరి. అధ్యక్షులగు డాక్టర్ బిధన్ చంద్రరాయ్ గారు ఈభావములను ఇంకను విపులముగ నువన్యసించిరి. వైద్యవిద్యబోధించు ఉపాధ్యాయుల పదవులు ఇండియన్ మెడికల్ సర్వీసు సభ్యులకే ప్రత్యేకించబడుటయు, తద్వారా యూరపీయులు గొప్పజీతములతో ఆ పదవులను అనుభవించుచు, భారతదేశ ద్రవ్యము రూ ౨౦ లక్షల కుమించి ప్రతియేడు ౨౦ వేలమంది యూరపీయులకు మాత్రమే ఖర్చగుచుండుటయు ఘోరముగనున్నదని వారనిరి.

రెండవరోజు (మరునాడు) మహాసభవారు ఇండియన్ మెడికల్ సర్వీసును ప్రత్యేకముగ యుద్ధోపయోగమునకే నుంచుకొని సాధారణ వైద్యావసరములకు వారలను నియోగించనే నియోగించరాదని తీర్మానించబడెను. సర్జన్ జనరల్ పదవిని తీసివేయవలెననియు, జిల్లా ఆస్పత్రులకు ఇండియన్ మెడికల్ సర్వీసువారలను నియోగించరాదనియు తీర్మానించబడెను మదరాసు ప్రభుత్వమువారు యల్. యం. పి. పట్టమునుతీసివేసి ఒక్క వైద్యపట్టభద్రుల తరగతిమాత్రమే యుండునట్లు నిశ్చయించినందుకు అభినందించు తీర్మానము చేయబడెను. వివిధ రాష్ట్రముల వైద్యసంస్థ అధికారులద్వారా ఇండియన్ మెడికల్ అసోసియేషనువారు రిజష్టరు చేయించుకొనుటకు అర్హులైన వైద్యులకు తగిన పోస్టు గ్రాడ్యుయేటువిద్యను, వివిధవైద్యవిషయములలో ప్రత్యేకజ్ఞానమును నేర్పుఏర్పాట్లు చేయుటకు కోరు తీర్మానము చేయబడెను. ఆంధ్ర విశ్వ విద్యాలయమువారి వైద్యపట్టములను ఇండియన్ మెడికల్ కౌన్సిలువారు అమోదించవలెననియు అట్లామోదించుటకు తగిన ఏర్పాటును విశాఖపట్టణము వైద్యకళాశాలలో చేయవలెననియు ఇంకొక తీర్మానములో గలదు.

పేటెంటుమందులకును, రిజష్టరు చేయబడిన మందులకును, సంబంధించిన ప్రకటనవలనను, ఉత్పత్తిని, అమ్మకమును క్రమపరచుటకు వివిధ రాష్ట్ర ప్రభుత్వములు చర్యగైకొనవలెననియు, ఇండియన్ మెడికల్ అసోసియేషనుయొక్క కేంద్రసంఘము రాష్ట్ర ప్రభుత్వములకు ఏవిషయముల ప్రావీణ్యత గడించినవానిని ఆవిషయములో గౌరవసర్జనులుగను, వైద్యులుగను నియమించవలెనని కోరవలెననియు, ప్రభుత్వోద్యోగులకు ఉచితముగా సలహానిచ్చు విధి ప్రభుత్వ వైద్యులకు ఉండరాదనియు, యుద్ధములో విషపుబాంబులనుండి వెడలు విషవాయువులనుండి సంరక్షించుకొను ఉపాయములను యేర్పాటుకు రాష్ట్రప్రభుత్వములు, కేంద్రప్రభుత్వములు కలిసి ఏర్పాటు చేయవలెననియు కూడ తీర్మానములు చేయబడెను.

ఈక్రింది తీర్మానవిషయములు గమనించదగినవి. (౧) భారతదేశమునకంతటికిని మొత్తముపై ఒకదేశీయారోగ్య రక్షణప్రణాళికను సమర్థులగు వార్తాశాస్త్రవేత్తలతో కలిసి ఆలోచించి తయారుచేయుటకు ఒక ఉపసంఘమును ఇండియన్ మెడికల్ కౌన్సిల్ వారేర్పాటుచేయవలెను.

(౨) అన్ని మునిసిపాలిటీలలోను జిల్లాబోర్డులలోను రాష్ట్రీయ ప్రభుత్వములు వ్యాయామవిద్యాబోధన కేంద్రముల నేర్పాటుచేయవలెను. వ్యాయామవిద్యను నిర్బంధశిక్షణీయముగ చేయవలెను. (౩) అన్ని మునిసిపాలిటీలలోను జిల్లాబోర్డులలోను శాస్త్రీయ వంటచేయు విధానమును చూపుటకు కేంద్రముల నేర్పాటుచేయవలెను. అన్ని మునిసిపాలిటీలలోను జిల్లాబోర్డులలోను సుశిక్షిత వైద్య పరిశీలనక్రింద స్త్రీశిశు కేంద్రముల నేర్పాటు చేయవలెను. (౪) రోగనివారణ విధానములను స్వస్థరక్షణ విధానమును, పారిశుద్ధ్యమును జనసామాన్యమందు ప్రచారముచేయుటకు అన్నిప్రదేశములందును సేవకదళము లుండవలెను.

## సీనాక్ విధ్వంసము

షాంఘాయి డిసెం ౨౮

చైనాప్రజలు తాము సీనాన్ వదలుటకు పూర్వము నగరమునందలి భవనముల నన్నిటికిని నిప్పంటించి ధ్వంసముచేసిరని జపాను సైనికాధికారులు ప్రకటించుచున్నారు. వీరు నగరమును వదలుచు ప్రభుత్వ కార్యాలయములను, జపాను రాయబారుల, వైద్యశాలల భవనములకు నిప్పంటించిరనియు వీరిప్రకటనలో గలదు.

## భూమ్యాదాయశాఖా కార్యదర్శిగారిపర్యటనము

(గోలకొండ విలేఖరి)

బూర్గంపాడు డిసెం ౨౮

భూమ్యాదాయ శాఖా కార్యదర్శులగు క్రాఫ్టన్ దొరగారు బహద్దర్ ౨౧ వ తారీఖున పాల్వంచకు దయచేసి అక్కడ పరిస్థితులను పరిశీలించి, భద్రాచలముకెళ్లి దేవస్థానమును పరిశీలించి వచ్చిరి. ౨౪ వ తారీఖున బూర్గంపాడువచ్చి ఖాల్సా కచేరీలను, సంస్థాన కచేరీలను, సర్కారీ దవాఖానా, సర్కారీ మదరసా మున్నగువానిని పరిశీలించిరి. వీరివెంట, అవ్వలుతాలూకదారుగారు దువ్వంతాలూకదారుగారు, వాజంసాహెబు సమస్దార్ గారును ఉండిరి. రైతులు తండోపతండములుగ చేరి తమకష్టముల విన్నవించుకొనిరి. తీసివేయబడిన సంస్థాన ఆదాలతు జిల్లాకచేరీ తిరిగి ఏర్పరచవలెననియు, మిడిల్ స్కూలు అవసరమనియు, కోరిరి. ప్రాథమిక విద్యావసరమునే యొక్కువగా గుర్తించవలెనని నొక్కి వక్కాణించిరి. ఖాల్సా మున్సిఫ్ గారి కోర్టుపైన యిక్కడనున్న ఉస్మానియా సిల్వర్ జూబిలీ క్లబ్బుభవనమునకు ప్రువాదిచేసిరి. తిరిగి ౧౨ గంటలకు పాల్వంచకు వెడలిపోయిరి. వీరి యాగమనార్థము వాజసాహెబు సమస్దార్ గారు పాల్వంచ మకాంలో తగినయేర్పాట్లు జరిగించిరి. ౨౪ వ తేదీ ౧౧ గంటలకు శ్రీ క్రాఫ్టన్ దొరగారు ఖమ్మంకెళ్లిరి,

ఖాల్సా తహశ్శీలుదారుగారి తిబాదులా

ఇక్కడ రెండుసంవత్సరములనుండి తహశీలుదారుగనున్న సయ్యదు నిజాముద్దీన్ సాహెబు కిన్వటుకు తబాదులా కాబడినందున మిత్రులు వీరిని విందులలోను టీపార్టీలలోను వీడ్కొల్పిరి. వాజరు తాలీమాతు సమస్దార్ గారు వీరిసేవను ప్రశంసించుచు కొన్ని పద్యముల చదివిరి. వీరిస్థానమున మానుకోటలో తహసీలుదారుగనున్న గురుస్వామిగారు విచ్చేసిరి.

## ౩౦ వేల ప్రజలకు వైమానిక శిక్షణ

షాంఘాయి డిసెం ౨౯

చైనాలో ముప్పదివేలప్రజలకు ఒకసంవత్సరము వైమానికశిక్షణ నొసగుటకు ప్రభుత్వమువారు నిశ్చయము గావించుకొనినారు. వీరిలో ౧౦ వేలమంది మార్చి నెలలోగానే పరిపూర్ణశిక్షణ బడసి యుద్ధమునందు పాల్గొనజాలెదరని తెలుపబడుచున్నది.

## అమెరికా వలంటీర్లు

షాంఘాయి డిసెం ౨౯

చైనాప్రజలకు యుద్ధమునందు సహాయము గావించుటకై యేతెంచిన అమెరికావలంటీరుల రెండవదళము హాంగ్ కాంగ్ కు పోవుచున్నది. ఈదళమునందు ౧౦ గురు విఖ్యాత మేజర్లును, ౫౦ మంది వైమానికులును గలరు. వీరివలన జపాను వైమానికదళముతో పోరాడుటకు అధికమగు సహాయము దొరకునని తలపబడుచున్నది.

## లోయాహాంగుగారు గుండుకు గురియగుట

షాంఘాయి డిస ౩౧

ఫ్రెంచువారి అధీన ప్రదేశమునందున్న తమ స్నేహితుని దర్శించి వెళ్ళుచుండగా మార్గమధ్యమున క్రొత్తగా యేర్పడిన నగర సంఘాధ్యక్షులగు లోయా హాంగుగారు తుపాకిగుండుకు బలియైరి. ఈసంఘము షాంఘాయిపరిసరప్రాంతములందు(చీనా అధీనప్రదేశములందు) పూర్వస్థితియేర్పరచుటకు యేర్పడియున్నది. హంతకుడు పారిపోయెను. లోయా హాంగుగారు సంఘమందలి యితర సభ్యులనుచివావారి ద్రోహులని యనుమానించుచుండిరి.

షాంఘాయి డిస ౩౧

హాంకోలో దళను సంరక్షించుటకై మార్షల్ చాంగ్ కైషేక్ గారు ౭ వందల కాంక్రీటు ప్రదేశములను ఉక్కుచట్టములతో అమర్చబడినవని యేర్పరచుట కాజ్ఞాపించినటుల గలదు. వీనియందు విమానధ్వంసక ఫిరంగులు యుద్ధ ఫిరంగులు ప్రతివానియందు ౭౦ సైనికులుంచబడునని తెలియుచున్నది.

## మ. ఘ. వ. నిజాంస్టేటు రైల్వే

12 జనవరి 1938 నాడు భద్రాచలములో

## ముక్కోటి ఏకాదశి పర్వ దినము

# తగ్గింపు రిటర్న్ టిక్కెట్లు

6 జనవరి మొదలు 12 జనవరి 1938 తేదివరకు రెండురోజులు కలుపుకొని మూడవతరగతి తగ్గింపు రిటర్న్ టిక్కెట్లు ఒక ప్రయాణమునకు ఒకటిన్నర రెట్లు చార్జితో రెండుప్రయాణములకు యీరైల్వేమీద యీక్రిందివిధముగా ఇవ్వబడును

త్రూబుక్కింగుకు:— యం. యస్. యం. రైల్వేలో కొన్నిస్టేషన్లనుండి, బెజవాడమీదుగా భద్రాచలం రోడ్డుకు.

లోకల్ బుక్కింగు:—యీ రైల్వేలో భద్రాచలంరోడ్డుకు 50 మైళ్ల దూరమున కెక్కువగాయున్న ప్రతిస్టేషన్నుండియు.

51 మైళ్లకు 3 వ తరగతి తగ్గింపుచార్జి రూ. 1—7—0.

ఎట్టిపరిస్థితులలోను, యీటిక్కెట్లఖరీదు వాపసు యివ్వబడదు. తిరుగు ప్రయాణము 15 జనవరి 1938 తేది అర్థరాత్రివరకు పూర్తిచేసుకొనుటకు యీ టిక్కెట్లు ఉపయోగపడును.

యాత్రికుల సౌకర్యార్థము, బెజవాడ, డోర్నకల్లులనుండి భద్రాచలం రోడ్డుకు అదనముగా 3 వ తరగతిపెట్టెలు తగిలించబడును.




## మ. ఘ. వ. నిజాం నేటు రైల్వే

### నెం. 31 ప్యాసింజరు, 102 షటిల్ బండ్ల రాకపోకలలో మార్పులు

11 జనవరి 1938 నుండి మొదలుకొని 13 ప్యాసింజరు, మరియు 102 షటిల్ బండ్ల రాకపోకలలో యీక్రింద చూపినప్రకారము కొద్దిమార్పు జరుగును.

13 ప్యాసింజర్

| స్టేషను | | గం. ని. | |
|---|---|---|---|
| కాజీపేట | పోక | 16-27 | |
| పెండియాల్ | ,, | 16-40 | |
| ఘనపూర్ | రాక | 16-55 | |
| | పోక | 16-56 | |
| రఘునాధపల్లి | రాక | 17-14 | |
| | పోక | 17-15 | |
| జనగాం | రాక | 17-30 | |
| | పోక | 17-32 | |
| పెంబర్తి | | ... | |
| ఆలేరు | రాక | 17-49 | |
| | పోక | 17-57 | |
| వంగపల్లి | రాక | 18-11 | |
| | పోక | 18-12 | |
| రాయగిరి | | ... | |
| భోనగిరి | రాక | 18-32 | × 102 |
| | పోక | 18-34 | |
| ఘటికేసర్ | రాక | 19-06 | |
| | పోక | 19-07 | |
| మాలాలి | రాక | 19-28 | |
| | పోక | 19-29 | |
| శికింద్రాబాదు | రాక | 19-40 | × 12 |
| | పోక | 20-01 | |
| జేమ్సుస్ట్రీటు | ,, | 20-08 | |
| హుసేన్ సాగర్ జంక్షన్ | రాక | 10-14 | × 10 |
| | పోక | 20-24 | |
| హైద్రాబాదు బి. జి. | రాక | 20-35 | |

102 షటిల్

| స్టేషను | | గం. ని. | |
|---|---|---|---|
| హైద్రాబాద బి. జి. | పోక | 17-08 | |
| ఖైరతాబాద | ,, | 17-16 | |
| హుసేన్ సాగర్ జంక్షన్ | రాక | 17-22 | × 1అప్ దూరకలె |
| | పోక | 17-31 | |
| జేమ్సు స్ట్రీటు | పోక | 17-36 | |
| శికింద్రాబాద | రాక | 17-44 | |
| | పోక | 17-49 | |
| మాలాలి | రాక | 18-00 | |
| | పోక | 18-01 | |
| ఘటకేసర్ | రాక | 18-19 | |
| | పోక | 18-27 | |
| బీబీనగరము | రాక | 18-44 | × 13 |
| | పోక | 18-54 | |
| భోనగిరి | రాక | 19-14 | |

### 1 అప్ ప్యాసెంజర్

| స్టేషను | | గం. ని. | |
|---|---|---|---|
| శికింద్రాబాద | పోక | 17-14 | |
| జేమ్సుస్ట్రీటు | ,, | 17-21 | |
| హుసేన్ సాగర్ జంక్షన్ | రాక | 17-26 | × 102 |
| | పోక | 17-27 | |
| ఖైరతాబాద | పోక | 17-33 | |
| హైదరాబాద బి. జి. | రాక | 17-42 | |
| | పోక | 17-55 | |

## దేశారాధకుడు డీవెలరా

(ఆరవ పేజి తరువాయి)

డి. ఈస్వీడిలో తాము మోటర్లపై పారిపోవడం మంచిదని తేలి, అతని సహచరులు తలచారు.

వాదోపవాదాలు జరిగినతర్వాత జైలునుంచి విడిపించిన వెంటనే ఖైదీలను మోటారుపై తీసుకునిపోయి ఒక కార్ఖానాలో అప్పుచేయవలెనని నిశ్చయించారు. కార్ఖానానుంచి వారిని షెఫీల్డు పంపించాలి; షెఫీల్డునుంచి మాంచెస్టర్ చేర్పించాలి. పోలీసువారు వీరిని వెదకటం మానటంతవఱకు మాంచెస్టర్‌లోనే ఉండనివ్వడానికి ఏర్పాటు చేశారు. ఈ కార్యభారం ముగ్గురికి అప్పగించారు. ఒక స్థానంనుంచి మరొక స్థానానికి డీవెలరాను ఆయన సహచరులను జాగ్రత్తగా చేర్పించాలని ఆజ్ఞ నిచ్చారు.

## సంఘర్షణకుకూడ సంసిద్ధపడి వెళ్లారు

సింహద్వారపు తాళంచెవికూడ తయారు చేయించారు. దానితోపాటు తాళ్ల నిచ్చెనలు కూడ వెంటతీసుకు వెళ్ళారు. ఒకవేళ తాళంచెవి నుపయోగించకపోతే, ఈతాళ్ల నిచ్చెనలద్వారా ఖైదీలను విడిపించుటకు పోవచ్చునని కేలీ చెప్పాడు. జైలువార్డరుతో సంఘర్షణ జరుగుతుందేమో అనే భయంకూడ కలిగింది. ఇందుకు కొన్ని ఆయుధాలనుకూడ వెంట తీసుకుపోయారు. అర్ధరాత్రి సమయాన జైలును చేరడానికి నిశ్చయించుకున్నారు.

లింకన్ నగరానికి కొద్దిదూరంలో పొలాల మధ్యలోవుంది, జైలుఖానా. దాని సింహద్వారం రోడ్డువైపునవుంది. దానికెదుటనే మిలిటరీ ఆసుపత్రి వుంది. కేలీని ఆసుపత్రివైపు చూస్తూఉండమని చెప్పి, బోలన్, కోలిన్స్ అనే ఐరిషువారిద్దఱు జైలు వెనుకభాగం వైపునకు వెళ్ళారు. వీరు టార్చిలైటు చూపించి ఖైదీలకు తాముచ్చిన సూచన నిచ్చారు. ఇందుకు ప్రత్యుత్తరంగా అగ్గిపుల్లల్ని వెలిగించి మేము జాగరూకులమై వున్నామని ఖైదీలు ఎఱుకపరిచారు. తాళ్ల సహాయంవల్ల వీరు ఖైదీలున్న కొట్టువద్దకు చేరిపోయారు. ఇలా చేరి తాళాన్ని తెరవడానికి తాళంచెవి అందుంచేసరికి అది విరిగిపోయింది. ఇంతలో డీవెలరా కొట్టు ద్వారందగ్గరకు చేరాడు. కేక్‌లో రహస్యంగావచ్చిన తాళంచెవితో చివరకి తాళాన్ని తెరిచారు.

కొట్టునుంచి బైటకువచ్చి డీవెలరా శ్వాస తీసికొన్నాడు, కాని ఇంకా ఆయన జైలు బయటపడలేదు. వీరు క్రిమంగా ముందుకు వెళ్లారు. ప్రహరీలు పహరా యిస్తున్నారు. వారిదృష్టి తప్పించుకుంటూ వీరు రెండవద్వారం దగ్గరికి చేరారు. ఆ ద్వారాన్ని కూడా తెరిచారు.

లింకన్‌లో ముందే ఒక మోటారును ఉంచారు. డీవెలరా తన సహచరులతో మోటారులో కూర్చున్నాడు. మొదట నిర్ణయించుకున్న మాదిరిగా వీరు మాంచెస్టర్ చేరారు. ఈ ఘటన ఫిబ్రవరి 1919 నాటిది.

## తప్పించుకుపోయి అమెరికా చేరినాడు

లింకన్ జైలునుంచి పారిపోయినతర్వాత న్యూయార్కులో డీవెలరా జాడ తెలిసింది. అమెరికాలోవున్న ఐరిషువారు డీవెలరాకు స్వాగతమిచ్చారు. అమెరికా వాసులుకూడ డీవెలరాకు పరిపూర్ణ సానుభూతిని చూపించారు. ఆ మహానీయుడు ప్రపంచదృష్టిని ఐర్లండు వైపునకు ఆకర్షింపజేయడానికి "డీల్ ఎరిన్" పేరుగల సంస్థనొకదానిని స్థాపించాడు. బ్రిటిషువారు ఐర్లండువిప్లవాన్ని అణచివేయడానికి "బ్లాక్స్ అండ్ టాన్స్" సైనికదళాన్ని పంపించారు. ఆది ఐర్లండు నాయకులను సామాన్య ఖైదీలవలె ఉరితీసివేసినది. డీవెలరా దేశంలోని ఈదుఃఖాన్ని చూడలేకపోయాడు. ఒకనాటి ఉదయం డీవెలరా ఎప్పటికోవెళ్లిపోయాడని అమెరికా నివాసులకు తెలిసింది. అంతట ఐర్లండులోని ప్రతి ఓడ రేవువద్ద గూఢచారులు కాపలా కాయసాగారు. కాని, ఎవరికంట పడకుండగనే డీవెలరా ఐర్లండు చేరుకున్నాడు.

ఈలోపున విప్లవాగ్ని ప్రజ్వరిల్లుతూనే వుంది. ఎంత ప్రయత్నించినా బ్రిటిషు ఐర్లండును శాంతపఱచలేక పోయింది. అప్పుడు లాయడ్ జార్జి ఐరిషు నాయకుల్ని మాట్లాడటానికి పిలిచాడు. డీవెలరా—లాయడ్ జార్జిలమధ్య చాలా దినాలు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. చివరకు సంధి జరిగింది. డీవెలరాకు ఈసంధితో సంతోషం కలుగలేదు. ఆయన సహచరుడైన మైకేల్ కాలిన్సు సంధికి అనుకూలంగా మాటాడాడు. ఇందుచే ఐర్లండులోని "డెలీఎరిన్"లో మతభేదం కలిగింది. అది రెండుభాగాలుగా చీలిపోయింది.

అటుతర్వాత డీవెలరాకు ఎలా మెజారిటీ వచ్చిందీ, ఆయన ఐర్లండుకు బ్రిటన్‌తో గల సంబంధాన్ని వదిలించడానికి ఎలా ప్రయత్నించిందీ మొదలైన వివరాల్ని గురించి ఎంతైనా చెప్పవచ్చునుగాని, అవి అందరికీ తెలిసిన ఇటీవలి సంఘటనలు గనక వాటిని ఇక్కడ ప్రత్యేకంగా వ్రాయ నవసరంలేదు.

—ప్రజామిత్ర





## దహన సంస్కారము

టోక్యో తిస ఎల్

చీనావారు నగరమునవదలుచు సైసెన్నా నగరమునకు నాలుగు వేళుల నిప్పంటించిరి. ఈ నగరమునందు రాష్ట్రీయ ప్రభుత్వమునకు ముఖ్య స్థానము, జపాను, జర్మని ప్రతినిధి కార్యాలయములు, జపాను ఆస్పత్రి యుండెను. జపాను వారిసేనల హడావుడి, జపాను విమానముల బాంబువర్షముకలన చీనాసైనికులు యీ నగరమునకు దక్షిణముకు విరలుచున్నారు.

## గాడెదకు భార్యనమ్మట

ఒకడు భార్యను ఖరీదుగనిచ్చి ఒకగాడిదను మేకను అమ్మినకథ జగోస్లావ్ ప్రభుత్వపత్రికయగు "ప్రేం" పత్రికలో ప్రకటించబడినది.

ఈ బేరము స్మదర్యెరూ మార్కెట్‌లో జరిగెను. అక్కడికి స్టోజమిర్ పాంటిక్ అను నతడు ఒక ముసలిగాడిదెను తోలుకొనిపోయెను. ఆ గాడిదెను, అతనితండ్రి సాలోనికాలో సంగ్రామాంతమున కొనియుండెను. అతడు ఒకమేకనుకూడ అమ్మవలెనని తోని యుండెను.

కాని ఆతడడిగిన ౪ పౌనుల ఖరీదు చాల ఎక్కువగనుండెను. అందుచే సాయంకాలము వరకుకూడ అవి అమ్ముడుపోలేదు.

తర్వాత సాయంకాలము, అప్రముఖన పోవుచుండినవాడొకడు ఆగాడిదెను జాగ్రత్తగా పరీక్షించి ఆదెంతధరయని యడిగెను. అతడు స్టోజమిరు చెప్పినధరను క్రిందికి దించుటకు ప్రయత్నించెను. కాని స్టోజమిరు ఏమాత్రము దిగలేదు.

అప్పుడు కొనవచ్చినవాడు స్టోజమిరు తన భార్యవైపు కన్నార్పక చూచుచుండుటగాంచి తాను ధరను నగదుగ చెల్లించాలని సంగతి స్థిరపడినది కనుక, అభార్యను అతనికిచ్చి గాడిదెను, మేకను కొనుటకు నిశ్చయించుకొని తెలిపెను.

ఇందుకు తుదకిపవురుడు అంగీకరించెను. అ వచ్చిన విజాకోవ్‌స్రావిచ్ అను నతడు ఆ గాడిదె తినప్రాణమును సాలోనికా యుద్ధరంగములో కాపాడియుండెనని తెలిపెను.

తనభార్యకూడ స్టోజమిరుపై అనురాగము చూపుటచే, విజాకో తనభార్యను స్టోజమిరుకిచ్చి, తానాగాడిదెను తీసికొనెను.

